



ఓమ్ [illegible]

# భక్తేశ్వర వ్రతకల్పః

శుభే శోభనే... ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ... అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థసిద్ధ్యర్థం పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం దీర్ఘసువాసినీత్వసిద్ధ్యర్థం హస్త్యశ్వరథాందోళికా ఛత్రవాహనాది ప్రాప్త్యర్థం వంధ్యాత్వనివృత్త్యర్థం అఖండిత లక్ష్మీప్రాప్త్యర్థం శ్రీ భక్తేశ్వర ముద్దిశ్య శ్రీ భక్తేశ్వర ప్రీత్యర్థం శ్రీ భక్తేశ్వరవ్రతం కరిష్యే... ఇతి సంకల్ప్య । తదంగకలశ గణపతిపూజాంచ కుర్యాత్ ।

ధ్యానమ్॥ శ్లో॥ సద్యోజాతం భవంచైవ వామదేవంభవోద్భవం। శ్వేతంశ్రీమంతఘోరుద్రం కాలకంఠంవికర్ణకం । బలంబల ప్రమథనం భూతఘ్నంచ మనోన్మనం। సద్యోజాతంత్రినేత్రం సకలసురనుతం కోటిసూర్యప్రకాశం। విఖ్యాతంవామదేవం హిమ్యాదికరవినిభం సజ్జనానామఘోరమ్। కల్యాణాంఘోరరూపం హ్యానలశతనిభం తత్పురుషంచిదాభం। ఈశానం శాంతరూపం స్ఫటికమణినిభం చింతయేత్పంచవక్త్రమ్॥ ధ్యాయామి॥ శ్లో॥ భవోద్భవంశివాతీతం భానుకోటిప్రభంవిభుం। ఆవాహయామిభూతేశం భవానీపతిముత్తమమ్॥ ఆవాహయామి॥ శ్లో॥ వామదేవవిరూపాక్ష వ్యాసపన్నుతవైశివ । వేదస్వరూపవరద ఆసనం ప్రతిగృహ్యతామ్ । ఆసనం సమర్పయామి ॥ శ్లో ॥ శ్వేతరూపనమస్తుభ్యం భస్మోద్ధూళివిగ్రహ । జీయాజైత్రవిభూతేత్వం గృహాణార్ఘ్యం మయార్పితమ్। అర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ సురశ్రేష్ఠజగచ్ఛ్రేష్ఠ శ్రవణానందవైభవ। పాద్యంగృహాణ హేశంభో దేవేశవృషభధ్వజ। పాద్యంసమర్పయామి॥ శ్లో॥ రుద్రరాద్రిరణోత్సాహ రాజరాజవ్రసన్నుత । పంచామృతస్నానమిదం కురుకల్యాణదాయక॥ పంచామృతస్నానం సమర్పయామి॥ శ్లో॥ కలవికరణవిభో కమలాసనవందిత । కార్తికేయస్యజనక

స్నానంకురుదయానిధే॥ శుద్ధోదకస్నానం సమర్పయామి॥ శ్లో॥ బలవికరణబల భానుకోటిప్రభాకర । బృందారకార్చితపద వస్త్రమాచ్ఛాదనంకురు॥ వస్త్రం సమర్పయామి॥ శ్లో॥ బలప్రబలసుబల బాణాసురవరప్రద । బీజరూపగృహాద్దామ ఉపవీతంగృహాణభో ॥ యజ్ఞోపవీతం సమర్పయామి॥ శ్లో॥ బలప్రమథనబల బుద్ధిరూపబుధప్రియ। బిల్వపత్రప్రియబల భూషణానిగృహాణభో॥ ఆభరణానిసమర్పయామి॥ శ్లో॥ సర్వభూతప్రమథన సర్వజ్ఞసకలోద్భవ। సర్వాత్మన్సర్వభూతేశ సుగంధం సంగృహాణభో ॥ గంధాన్ సమర్పయామి॥ శ్లో॥ మనోన్మనమహాభాగ మాయాతీతమహేశ్వర। మంజుమంజీరచరణ సంగృహాణాక్షతాన్విభో॥ అక్షతాన్ సమర్పయామి॥ శ్లో॥ అఘోరపరమప్రఖ్య అంచితావ్యక్తలక్షణ । అనాదిత్యసంకాశ పుష్పాణిప్రతిగృహ్యతామ్॥ పుష్పాణి సమర్పయామి ॥

అథాంగపూజా॥ సద్యోజాతాయనమః । పాదౌపూజయామి॥ భవోద్భవాయనమః । గుల్ఫౌపూజయామి ॥ భవాయనమః। జంఘేపూజయామి॥ వామదేవాయనమః। జానునీపూజయామి ॥ జ్యేష్ఠాయనమః। ఊరూపూజయామి॥ శ్రేష్ఠాయనమః కటింపూజయామి॥ రుద్రాయనమః। గుహ్యంపూజయామి॥ కాలాయనమః। నాభింపూజయామి॥ బలవికరణాయనమః। ఉదరంపూజయామి॥ కలవికరణాయనమః। హృదయంపూజయామి॥ బలాయనమః। స్తనౌపూజయామి॥ బలప్రమథనాయనమః। భుజౌపూజయామి॥ సర్వభూతదమనాయనమః। వామహస్తం పూజయామి ॥ మనోన్మనాయనమః । వామాంగుళీః పూజయామి ॥ అఘోరాయనమః । దక్షిణహస్తంపూజయామి ॥ ఘోరాయనమః । దక్షిణాంగుళీః పూజయామి॥ ఘోరఘోరతరాయనమః । కంఠంపూజయామి ॥ సర్వాయనమః । స్కంధౌపూజయామి ॥ శర్వాయనమః । చుబుకంపూజయామి ॥ సద్రూపాయనమః । ముఖంపూజయామి ॥ తత్పురుషాయనమః। జిహ్వాంపూజయామి॥ మహాదేవాయనమః। నాసికాంపూజయామి॥ రుద్రాయనమః। వామశ్రోత్రంపూజయామి। ఈశానాయనమః । దక్షిణశ్రోత్రంపూజయామి ॥ సర్వవిద్యాధిపతయేనమః।

వామనేత్రంపూజయామి॥ ఈశ్వరాయనమః। దక్షిణనేత్రంపూజయామి॥ సర్వభూతాధిపతయేనమః। లలాటంపూజయామి॥ బ్రహ్మాధిపతయేనమః। శిరఃపూజయామి॥ శివాయనమః। జటాజూటంపూజయామి॥ సర్వేశ్వరాయనమః। సర్వాణ్యంగాని పూజయామి॥

## అష్టోత్తర శతనామపూజా.

ఓం శివాయనమః। మహేశ్వరాయనమః। శంభవేనమః। పినాకినేనమః। శశిశేఖరాయనమః।వామదేవాయనమః।విరూపాక్షాయనమః। కపర్దినేనమః। నీలలోహితాయనమః। శంకరాయనమః। శూలపాణయేనమః। ఖట్వాంగినేనమః। విష్ణువల్లభాయనమః। శిపివిష్టాయనమః। అంబికానాథాయనమః। శ్రీకంఠాయనమః। భక్తవత్సలాయనమః।భవాయనమః। శర్వాయనమః। త్రిలోకేశాయనమః। శితికంఠాయనమః। శివాప్రియాయనమః। ఉగ్రాయనమః। కపాలినేనమః। కామారయేనమః। అంధకాసురసూదనాయనమః। గంగాధరాయనమః। లలాటాక్షాయనమః। కాలకాలాయనమః। కృపానిధయేనమః। భీమాయనమః। పరశుహస్తాయనమః। మృగపాణయేనమః। జటాధరాయనమః। కైలాసవాసినేనమః। కవచినేనమః। కఠోరాయనమః। త్రిపురాంతకాయనమః। వృషాంకాయనమః। వృషభారూఢాయనమః। భస్మోద్ధూళితవిగ్రహాయనమః। సామప్రియాయనమః। సర్వమయాయనమః। త్రయీమూర్తయేనమః। అనీశ్వరాయనమః। సర్వజ్ఞాయనమః। పరమాత్మనేనమః। సోమసూర్యాగ్నిలోచనాయనమః। హవిషేనమః। యజ్ఞమయాయనమః। సోమాయనమః। పంచవక్త్రాయనమః। సదాశివాయనమః। విశ్వేశ్వరాయనమః। వీరభద్రాయనమః। గణనాథాయనమః। ప్రజాపతయేనమః। హిరణ్యరేతసేనమః। దుర్ధర్షాయనమః। గిరిశాయనమః। గిరీశాయనమః। అనఘాయనమః। భుజంగభూషణాయనమః। భర్గాయనమః। గిరిధన్వనేనమః। గిరిప్రియాయనమః। కృత్తివాససేనమః। పురారాతయేనమః। భగవతేనమః। ప్రమథాధిపాయనమః। మృత్యుంజయాయనమః। సూక్ష్మతనవేనమః। జగద్వ్యాపినేనమః। జగద్గురవేనమః। వ్యోమకేశాయనమః। మహాసేనజనకాయనమః। చారువిక్రమాయ

నమః। రుద్రాయనమః। భూతపతయేనమః। స్థాణవేనమః। అహిర్బుధ్న్యాయనమః। దిగంబరాయనమః। అష్టమూర్తయేనమః। అనేకాత్మనేనమః। సాత్వికాయనమః। శుద్ధవిగ్రహాయనమః। శాశ్వతాయనమః। ఖండపరశవేనమః। అజాయనమః। పాశవిమోచకాయనమః। మృడాయనమః। పశుపతయేనమః। దేవాయనమః। మహాదేవాయనమః। అవ్యయాయనమః। హరయేనమః। పూషదంతభిదేనమః। అవ్యగ్రాయనమః। దక్షాధ్వరహరాయనమః। భగనేత్రభిదేనమః। అవ్యక్తాయనమః। సహస్రాక్షాయనమః। సహస్రపదేనమః। అపవర్గప్రదాయనమః। అనంతాయనమః। తారకాయనమః। పరమేశ్వరాయనమః। శ్రీభక్తేశ్వరస్వామినేనమః। నానావిధపరిమళపత్రపుష్పాణిపూజయామి ।

శ్లో॥ ఘోరరూపనమస్తుభ్యం సర్వకామార్థదాయక । ధర్మస్వరూపధనద ధూపోఽయంప్రతిగృహ్యతామ్॥ ధూపమాఘ్రాపయామి॥ శ్లో॥ ఘోరఘోరనమస్తుభ్యం ఖడ్గఖేటధరాఽవ్యయ । ఖడ్గేందుమాళిశిఖరం దీపోఽయంప్రతిగృహ్యతామ్॥ దీపందర్శయామి॥ శ్లో॥ నమశ్శర్వాయనర్వేశ సర్వావాససనాతన। సదానందసురశ్రేష్ఠ నైవేద్యంప్రతిగృహ్యతామ్॥ నైవేద్యంసమర్పయామి॥ శ్లో॥ శర్వాయచనమస్తుభ్యం రజనీకరభూషణ । శంభోశంకరగౌరీశ తాంబూలంప్రతిగృహ్యతామ్॥ తాంబూలంసమర్పయామి॥ శ్లో॥ రుద్రరూప నమస్తుభ్యం భక్తప్రియ సదాశివ। గజచర్మపరీధాన నీరాజనమిదంతవ॥ కర్పూరనీరాజనం సమర్పయామి॥ శ్లో॥ తత్పురుషాయనమస్తుభ్యం త్రియామమతిలోచన । త్రిస్వరాకారసర్వజ్ఞ మంత్రపుష్పంగృహాణభో॥ మంత్రపుష్పం సమర్పయామి॥ శ్లో॥ మహాదేవనమస్తుభ్యం మాయాతీత మహామతే। ప్రదక్షిణంకరోమిత్వాం పాపంనాశయమే ప్రభో॥ ప్రదక్షిణంసమర్పయామి॥ శ్లో॥ ఈశానాయనమస్తుభ్యం పార్వతీపతయేనమః । సర్వేశ్వరనమస్తుభ్యం పంచవక్త్రినమోనమః । సద్యోజాతంనమస్తుభ్యం వామదేవాయతేనమః। అఘోరాయనమస్తుభ్యం తత్పురుషాయనమస్తవ॥ నమస్కారాన్ సమర్పయామి॥ శ్లో॥ కుబేరమిత్రదేవేశ భూతేశత్రిపురాంతక। పార్వతీహృదయానంద గృహాణార్ఘ్యం నమోఽస్తుతే॥ శ్రీభక్తే

శ్వరాయనమః॥ ఇదమర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ కైలాసవాసిన్ దేవేశ భువనత్రియపాలక హిమవత్పుత్రికాకాంత గృహాణార్ఘ్యంనమోస్తుతే॥ ఇదమర్ఘ్యంసమర్పయామి। శ్లో॥ చంద్రమాశ్శేత్రయీనాథ జటామకుట శోభిత। ఉమాకాంతనమస్తుభ్యం గృహాణార్ఘ్యం నమోస్తుతే॥ ఇద మర్ఘ్యం సమర్పయామి॥ అథప్రార్థన॥ శ్లో॥ ఋణపాతకదౌర్భాగ్య దారిద్ర్యవినివృత్తయే। అశేషాఘవినాశాయ ప్రసీదమమశంకర॥ దుఃఖ శోకాదిసంతప్తం సంసారభయపీడితం। బహుజన్మార్జితలందీపం త్రాహి మాంవృషవాహన॥ శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజా క్రియాదిషు। న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందేతమీశ్వరమ్॥

ఇతి పూజావిధానం సంపూర్ణమ్॥

## భక్తేశ్వర వ్రతకథ.

ఋషయః॥ శ్లో॥ సూతసూతమహాప్రాజ్ఞ పురాణార్ణవపారగ। త్వత్తః శ్రుతాన్యశేషాణి వ్రతానిసుబహూనిచ। తృప్తిర్నజాయతేఽస్మాకం రహస్యంతు పరంవద॥

తా॥ శౌనకాదిమునీశ్వరు లడుగుచున్నారు. విశేషజ్ఞానము గలవాడవై పురాణంబులనెడు సముద్రముయొక్క ఆవలితీరమును జూచినయో సూతమహాముని! నీవల్లనేకవ్రతములను శేషములేకుం డునట్లుగా వింటిమి; మాకుఁ దనివితీరలేదు. ఎవరును నేరుఁగనిరహస్య మైన వ్రతముండు నేనిఁ జెప్పుమనిరి.

సూతః॥ శ్లో॥ శృణ్వంతుభోద్విజాస్సర్వే వ్రతంపాపప్రణాశనం। ఆయుష్యమారోగ్యకరం వ్రతంపుత్రప్రదంనృణామ్॥

తా॥ ఓ బ్రాహ్మణులారా! పాపమును నశింపఁజేయు వ్రతమును మీరందఱు విందురుగాక. అది మనుష్యులకు నాయుర్వృద్ధి నారోగ్య మును నిచ్చునదియై, పుత్రులనొసంగువ్రతమనిని సూతుఁడు పలికెను.

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే మంటపేవిమలేశుభే। రత్నపీఠేసుఖాసీనం శంకరంలోకశంకరం। పప్రచ్ఛగౌరీసంతుష్టా లోకానాంహితకారణాత్॥

తా॥ మనోహరమైన కైలాసశిఖరమందు నిర్మలమై శోభస్కర మైన మంటపములో రత్నములతోఁ గూర్పఁబడిన సింహాసనమందు

సుఖముగాఁ గూర్చుండినటువంటియు, ప్రపంచమునకు సుఖమును గలుగఁజేయునట్టియు, సాంబమూర్తితో పార్వతీదేవి మూఁడులోకములకు హితవును గలుగఁజేయు తలంపుతో సంతోషముగా నొక వాక్యమును బలికెను.

గౌరీ॥ శ్లో॥ శివశంభోనమస్తుభ్యం సర్వేషాం సుఖదాయక । రహస్యం వ్రతమాచక్ష్వ ఆయురారోగ్యవర్ధనమ్ ॥

తా॥ ఓశివ, శంభో, సమస్తమైనవారికి సుఖమునిచ్చువాఁడా! నీకు నమస్కరించుచున్నాను. ఆయురారోగ్యములను వృద్ధిని బొందించు రహస్యమైన వ్రతమును జెప్పుమని పార్వతి యడిగెను.

శ్లో॥ పుత్రప్రదంవిశేషేణ వంధ్యాత్వాదివిమోచనం । తద్వ్రతం బ్రూహి మేక్షిప్రం లోకానాంహితకారణమ్ । త్వదాజ్ఞాంశిరసాధృత్వా కరిష్యామిననంశయః ॥

తా॥ మఱియు విశేషముగా సంతానమును గలిగించునదియు, గొడ్రాలితనమును బోఁగొట్టునదియు, లోకములకు హితవును జేయునదియునైన వ్రతమును శీఘ్రముగాఁ జెప్పితిరేని మీయాజ్ఞను శిరసావహించి యావ్రత మొనర్చెదను. సందేహము లేదు.

శ్రీశివః॥ శ్లో॥ సాధుసాధుమహాభాగే వ్రతంవక్ష్యామితచ్ఛృణు ॥

తా॥ ఎక్కువైన సుగుణసంపత్తిగల యో పార్వతీ! నీవువేసిన ప్రశ్నము మిక్కిలి యోగ్యమైనది. నీవు కోరినట్టివ్రతమును జెప్పెదను. వినుమని సాంబమూర్తి పలికెను.

శ్లో॥ శరత్కాలేతుకార్తిక్యాం పౌర్ణిమ్యాంవిధిపూర్వకం । ప్రాతస్స్నాత్వాతువిధి చ్చిత్రవస్త్రంతుధారయేత్ ॥

తా॥ శరత్కాలమందు కార్తికశుక్ల పూర్ణిమాదినమున ప్రాతఃకాలమందు యథావిధిగా స్నానముచేసి చిత్రమైన వస్త్రమును ధరించవలెను.

శ్లో॥ హరిద్రాలేపనంకృత్వా కుంకుమంకజ్జలంతథా । నానావిధాని సర్వాణి హేమాని రజతానిచ । భూషణాని విచిత్రాణి శ్రద్ధాయాధారయేద్వ్రతీ ॥

తా॥ వ్రతమును జేయదలఁచిన స్త్రీ శ్రద్ధతోఁ బసుపును బూసికొని కుంకుమను గాటుకను ధరించి యథేష్ట ప్రకారముగా బంగారుతోను వెండితోను సుందరముగాఁ జేయఁబడిన విశేషమైన నగలను శ్రద్ధతో ధరించవలెను.

శ్లో॥ పత్యురాజ్ఞాం గృహీత్వాతు వ్రతంకుర్యాద్వరాననే ॥

తా॥ యో సుందరమైన ముఖముగల పార్వతీ? భర్తయొక్కయాజ్ఞనుబొంది యీవ్రతమును జేయవలయును.

శ్లో॥ పూజయేద్దేవదేవేశం చందనేనవినిర్మితం । హారిద్రియాతు గౌరీంచ సైకతేనవృషంతథా। నామమంత్రైఃసంపూజ్య సాంబంవృష సమన్వితం । చాతుర్వర్ణోద్భవానారీ భక్త్యాసంపూజయేచ్ఛివమ్ ॥

తా॥ దేవతులకు దేవుఁడైన సాంబమూర్తిని మంచి గంధముచేతను బార్వతిని బసుపుచేతను నిర్మించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్ర స్త్రీలలో నేస్త్రీయైనను భక్తితోఁగూడినదై వారివారి నామమంత్రములచే పార్వతితోను వృషభవాహనముతోనుగూడిన శివుని బూజింపవలెను.

శ్లో॥ సూర్యేచాస్తంగతేదేవి గృహేదేవాలయేఽపివా। గోమయేన విలిప్యాఽథ రంగవల్ల్యావిచిత్రితైః । మంటపంకారయేత్తత్ర తోరణాద్యైరలంకృతమ్ ॥

తా॥ ఓ పార్వతీ? సూర్యుఁడస్తమించిన పిమ్మటఁ దన గృహమందైనను, దేవాలయమందైనను గోమయంబుచేఁ జక్కఁగా నలికి చిత్రమైన ముగ్గులుపెట్టి యనేకవిధములైన తోరణములతో నలంకరింపఁబడిన మంటపమును నిర్మింపవలెను.

శ్లో॥ తత్రసంపూజయేద్దేవం శాంభవీంభువనేశ్వరీం । భక్త్యాసంపూజితోయేన తేనభక్తేశ్వరస్స్మృతః ॥

తా॥ ఆమంటపమందు సాంబమూర్తిని లోకమాతయైన పార్వతిని బూజింపవలెను ఏకారణముచే నీశ్వరుఁడు భక్తునిచేఁ బూజింపఁబడుచున్నాఁడో యాకారణముచే భగవంతుఁడు భక్తేశ్వరుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ సర్వమంగళమాంగళ్యే శివేసర్వార్థదాయకే। శరణ్యేత్ర్యంబకే గౌరి భక్తేశ్వర నమోస్తుతే। ఇత్థంపురాణమంత్రైః షోడశైరుప చారకైః। ధూపందీపంచదత్వాఽను నైవేద్యందాపయేద్వ్రతీ॥

తా॥ వ్రతము నాచరించు స్త్రీ "సర్వమాంగళమాంగళ్యే" ఈ మొదలైన పురాణమంత్రములచేతను, షోడశోపచారములచేతను బూజించి ధూపదీపము నిచ్చి శీఘ్రముగా నైవేద్యమును సమర్పించ వలయును.

శ్లో॥ యంత్రపాత్రంప్రకృత్వాఽథ వేణునాయుతఛిద్రకం। త్రయ స్త్రింశత్స్వర్ణసూత్రై స్తత్పాత్రంవేష్టయేద్వ్రతీ॥

తా॥ అనంతరంబున వెదురుతో రంధ్రములుగల యొక జల్లెడను నిర్మించి అజల్లెడను ముప్పదిమూడు బంగారపు తీగెలచేఁ జుట్ట వలయును.

శ్లో॥ తస్మిన్నపూపాన్నిక్షిప్య సమాజ్యఘృతశర్కరా। తన్మధ్యే వకటంత్వేకం శర్కరాఘృతసంయుతమ్॥

తా॥ ఆజల్లెడలో పప్పు, నెయ్యి, పంచదార మొదలగువానితో వండిన బూరెలనుంచి వానిమధ్య పంచదార నెయ్యితోవండిన దోసె నొకటి యుంచవలెను.

శ్లో॥ తస్యోపరిక్షిపేద్దీపం శాలిపిష్టేనకారితం। వసునాకారయేద్వర్తి మగ్రేకార్యానుసంయుతమ్॥

తా॥ ఆదోసెలపైన బియ్యపుపిండితోఁ జేయఁబడిన ప్రమిద నొకటినుంచి దానిలో ముందు జరుగబోవుకార్యము సాంతమగువఱకు దీపము నుండునట్లు బంగారపువత్తి నుంచవలయును.

శ్లో॥ దీపంప్రజ్వాలయేత్తస్మిన్ పూజయేచ్చసుమంగలీం। దానం కృత్వా సుమంగల్యై పరమేశ్వరతుష్టయే॥

తా॥ ఆపిండి ప్రమిదయందు దీపమును వెలిగించి ముత్తైదువను బూజించి భగవంతుని ప్రీతికొఱకు ఆ సువాసినీస్త్రీకిఁ బూర్వమందుఁ జెప్పఁబడిన దీపసహితమైన జల్లెడను దానముచేయవలెను.

శ్లో॥ భక్తేశ్వర సదా పాహి గౌర్యాసహ కృపానిధే । దానేనానేన సుప్రీత ఆయుష్యం దేహి మే కులే। పతిం దీర్ఘాయుషం పుత్రాన్ పౌత్రాన్ బంధూన్ వశానిహ । ధనధాన్యాభివృద్ధించ ప్రయచ్ఛ జగదీశ్వర । ఏవం విధం ప్రకర్తవ్యం భక్తేశ్వరవ్రతం ముదా ॥

తా॥ దయాసముద్రుఁడవైన ఓ భక్తేశ్వరా! పార్వతితోఁ గూడిన వాడవై మమ్ముల నెల్లప్పుడు రక్షింపుము ఈ దానముచే సంతోషించినవాఁడవై నావంశమునకు దీర్ఘాయుర్దాయము నియ్యవలయును. నా పెనిమిటిని, పుత్రులను, మనుమలను, దీర్ఘాయుష్మంతులగునట్లుగాఁ జేయవలెను. ఓ లోకనాయకా ధనమును, ధాన్యమును వృద్ధిని బొందింపవలయునని ప్రార్థించి యీక్రిందఁ జెప్పఁబోవురీతిగా సంతోషముతో భక్తేశ్వరవ్రతమును జేయవలెను.

శ్లో॥ మార్గశీర్షేఽథ పౌర్ణమ్యాం వటకౌద్వావుదీరితౌ । ద్వౌదీపౌ దాపయేద్దేవ్యై దీర్ఘాయుష్యం వివృద్ధయే ॥

తా॥ మార్గశిరమాస పూర్ణిమాదినమున రెండు దోసెలు రెండు దీపములు దీర్ఘాయుర్దాయమునకు పార్వతీదేవికి సమర్పింపవలయును.

శ్లో॥ పుష్యే త్రీణి ప్రదాతవ్యం త్రయోదీపా విధీయతే । మాఘే చత్వారి దీపాని తత్సంఖ్యా వటకానపి ॥

తా॥ పుష్యమాసంబున మూఁడు దోసెలును, మూఁడు దీపములును మాఘమాసంబున నాలుగు దీపంబులును నాలుగు దోసెలును నుంచవలయును.

శ్లో॥ ఫాల్గునే పంచదీపాంశ్చ తత్సంఖ్యా వటకాంస్తథా । చైత్రే షడ్వటకాన్ దద్యాద్దీపాష్షట్ప్రకీర్తితాః ॥

తా॥ ఫాల్గుణమాసంబున అయిదు దీపంబులును అయిదు దోసెలును, చైత్రమాసంబున ఆఱు దీపంబులును నాఱు దోసెలును సమర్పింపవలయును.

శ్లో॥ వైశాఖే సప్త దాతవ్యం దీపాంశ్చైవ విశేషతః। ఏవమేవప్రకారేణ త్రయస్త్రింశచ్చ పౌర్ణిమాః ॥ ఏకద్విధా ప్రదాతవ్యం వటకాశ్చ

విశేషతః॥ తథాసర్వాణిదీపాని సుమంగళ్యై ప్రదాపయేత్। ప్రణమ్య భక్తిభావేన తాంబూలం దక్షిణాయుతమ్। వ్రతరాజమిదంప్రోక్తం స్త్రీణాం సౌభాగ్యకారణమ్॥

తా॥ వైశాఖమాసంబున నేడు దీపంబులు నేడు దోసెలును, సమర్పించవలెను. ఈ ప్రకారంబుగా ముప్పదిమూడు పూర్ణిమలకు నొక్కొక్క దీపము ఒక్కొక్క దోసెలను హెచ్చుగానిచ్చుచు ముత్తైదువనుబూజించి భక్తిభావముతో నమస్కరించి సమస్తమైన దీపములను దోసెలును ముత్తైదుకు వాయనమిచ్చి దక్షిణతోఁగూడిన తాంబూలము నివ్వవలయును. ఈప్రకారముగాఁ జేయఁబడిన వ్రతము స్త్రీలకు సమస్తైశ్వర్య సౌభాగ్యకారణమగును

శ్లో॥ అత్ర తేకథయిష్యామి ఇతిహాసంపురాతనం। శృణ్వతాంసర్వ పాపఘ్నం కీర్తిదం భువనత్రయే॥

తా॥ మూఁడు లోకములకు నిష్టురాలవైన ఓపార్వతీ! యీ వ్రతమును జేయుటనుగూర్చి వినువారియొక్క పాపములను నశింపఁ జేయునదియుఁ గీర్తినిచ్చునదియు నగు పూర్వచరిత్రను నీకుఁ జెప్పెద.

సూత॥ శ్లో॥ అస్తిభూమండలేకాచి న్మధురామధురాకృతిః। కృతమాలానదీతీరే రాజాపరమధార్మికః। వదాన్యోరూపసంపన్నో రాజలక్షణలక్షితః। శాస్త్రజ్ఞోధనవాన్శూరో ధైర్యేణహ్యామితద్యుతిః॥ యశసాచైవకీర్త్యాచ విఖ్యాతోభువనత్రయే। సోమవంశోద్భవోరాజా చంద్రపాండ్యఇతీరితః॥

తా॥ భూలోకంబున కృతమాలాయను నదీసమీపంబున రమ్యమైన మధురయనెడు పట్టణంబుగలదు. ఆపట్టణమందు విశేషధర్మాత్ముఁడును ప్రియంబు వలుకువాఁడును, సౌందర్యముగలవాఁడును, రాజచిహ్నములు గలవాఁడును, శాస్త్రములను దెలిసినవాఁడును, ధనవంతుఁడును, పరాక్రమము గలవాఁడును, ధైర్యముచే మిక్కిలి ప్రకాశించువాఁడును, గీర్తిచే మూఁడులోకంబులఁ బ్రసిద్ధికెక్కినవాఁడును నయి చంద్రవంశంబున బుట్టిన చంద్రపాండ్యుఁడనురాజు గలడు.

శ్లో॥ తస్యభార్యామహాభాగా పాతివ్రత్యపరాయణా। కుముద్వతీతి విఖ్యాతా కుముదోత్పలలోచనా। భర్తృశుశ్రూషణపరా శిష్టానామిష్టదాయినీ। అనుకూలకళత్రేణ పాలయామాసమేదినీమ్॥

తా॥ ఆరాజునకు విశేషభాగ్యవతియుఁ బాతివ్రత్యమందాసక్తి గలదియు నల్లగలువలవంటి నేత్రములుగలదియు పతిని సేవించుటయందాసక్తిగలదియు సజ్జనులను బోషించునదియు కుముద్వతియను ప్రసిద్ధిగలభార్య యుండెను ఇట్టి యనుకూలమైన భార్యతోఁగూడి యారాజు భూమి నేలుచుండెను.

శ్లో॥ కవాటతోరణవతీం హర్మ్యప్రాకారశోభితాం। తాంపురీం పాలయామాస రాజాపరమధార్మికః॥

తా॥ మిక్కిలి సుందరమైన తలుపులతోను, తోరణములతోను, మేడలతోను, కోటతోను ప్రకాశించు మధురాపురమును ధర్మాత్ముఁడైన యారాజు పాలించుచుండెను.

శ్లో॥ దంపతీపుత్రహీనౌచ యయతుర్నిర్జనంవనం। సమారాధ్య శివంభక్త్యా నిరాహారోజితేంద్రియః। జపన్ పంచాక్షరీవిద్యాం వర్షాణామయుతంతతః। తిష్ఠన్నేకేనపాదేన దశవర్షాణ్యహర్నిశం। ఫలాశీ దశవర్షాణి త్రింశద్వర్షాణితోయభుక్। శీతోష్ణవాతవర్షాణాం సహనో నిరహంకృతిః। శివంప్రపూజయామాస ధుత్తూరైః కమలైశ్శుభైః॥

తా॥ అనంతరంబారాజు సంతతిలేనివాఁడై భార్యతోఁగూడి జనశూన్యమైన యరణ్యమునకువెళ్ళి యాహారమువాని యింద్రియములనుజయించి విశేషభక్తితోఁ శివునిసేవించి పదివేలసంవత్సరములు పంచాక్షరీవిద్యను జపించుచుఁ బిమ్మటఁ బదిసంవత్సరములు రాత్రిఁబగల్లు భూమిమీఁద నొక్కపాదముతో నిలుచుండి తపస్సుచేయుచుఁ బదిసంవత్సరములుపండ్లనుభక్షించుచు ముప్పదిసంవత్సరములు జలముపానముచేయుచుఁ చలిని వేడిమిని వాయువును వర్షమునుసహించుచు నహంకారము వదలినవాఁడై యుమ్మెత్తపువ్వులతోను శోభస్కరమైన పద్మములతోను ఈశ్వరారాధనము చేయుచుండెను.

శ్లో॥ అతిథింతర్పయామాస ఫలమూలజలాదిభిః । తపసాచవనం తస్య తేజసాచమహోద్భుతమ్ ॥

తా॥ ఫలములచేతను దుంపలచేతను జలము మొదలైనవాని చేత నతిథులను దృప్తిని బొందించుచుండెను ఆరాజుయొక్క తపస్సు చేతను తేజస్సుచేతను అరణ్యము మిక్కిలి ప్రకాశించుచుండెను.

శ్లో॥ గోభిర్వ్యాఘ్రైర్గజైస్సింహై ర్నకులైశ్చభుజంగమైః । క్రీడంతి నహానిర్వైరా స్తేజసాతస్యతద్వనే ।

తా॥ ఆయరణ్యమం దారాజుయొక్క ప్రభావముచే గోవులు, పెద్దపులులు, ఏనుగులు, సింహములు, ముంగిసలు, పాములును, బరస్పరవైరము లేక యేకీభవించి సంచరించుచుండెను.

శ్లో॥ మందభానురభూద్భాను ర్దేవాస్సర్వేచకంపిరే । తేజసాతస్య సద్భావం తర్కయామాసురన్వహమ్ ॥

తా॥ ఆరాజుయొక్క ప్రభావముచే సూర్యుండల్ప తేజస్సుగల వాడాయెను. దేవతలందఱు కంపముగలవారై యాయనప్రభావమును ప్రతిదినంబునఁ జరిగింపుచుండిరి

శ్లో॥ ఉగ్రేణతపసాతుష్టౌ పార్వతీపరమేశ్వరౌ । ఆవిర్బభూవతురతః కరుణాయుతలోచనౌ ॥

తా॥ పార్వతీపరమేశ్వరు లారాజుచేసిన తీక్ష్ణమైన తపస్సుచే సంతోషించినవారుగనుకనే దయతోగూడినదృష్టిగలవారై ప్రత్యక్షమైరి.

శివః॥ శ్లో॥ హేరాజ రాజమహిషి! కిమర్థంతపసేభవాన్ । పితృపైతామహంరాజ్యం త్యక్త్వావనమిహాగతః ॥

తా॥ ఓరాజా! ఓకుముద్వతి! మీవంశపరంపరగా వచ్చుచున్న రాజ్యమునువిడిచి వనమునకు వచ్చినవాఁడవై నీవెందు నిమిత్తము తపస్సుచేయుచున్నావని శివుఁడడిగెను.

శ్లో॥ శివవాక్యం సమాకర్ణ్య సంతుష్టోభార్యయాసహ । కాయం నిపాతయామాస భూమావాటకదండవత్ ॥ ప్రణమ్య విధివద్భక్త్యా బద్ధాంజలిరభాషత । ధన్యోస్మ్యనుగృహీతోస్మి పాలితోస్మిమహేశ్వర॥

యదిమేత్వంప్రసన్నోఽసి పుత్రందేహిచిరాయుషం । మధురాంపాలని ర్ధాయ మద్వంశస్యాఽభివృద్ధయే ॥

తా॥ సాంబమూర్తిపలికిన వాక్యమును ఆరాజువిని సువర్ణదండమువలె భార్యతోఁగూడ సాష్టాంగముగా విధిప్రకారం నమస్కరించి భక్తితోఁ చేతులుజోడించి యిట్లు పలుకుచున్నాఁడు. ఓదేవా! నీవు ప్రత్యక్షమగుటచే ధన్యుఁడను. గాన మమ్ములను రక్షింపుచు మధురాపట్టణమును బాలించువాఁడును కులమును వృద్ధినొందించువాఁడను, చిరాయువుగల పుత్రునిదయచేయుమని కోరిరి.

శ్లో॥ ఇతిపృష్టస్సురాజ్ఞావై భగవాన్ పరమేశ్వరః। జన్మాంతరకృతైః పాపైస్సంతానంతవనాస్తిహి। తథాఽపితవభక్త్యాతు తుష్టోదాస్యామి వాంఛితమ్ ।

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన సాంబమూర్తి యీప్రకారముగా చెప్పెను. ఓరాజా! నీవు పూర్వజన్మంబునఁజేసిన పాపములచే నీకు సంతానముకలుగలేదు. అయినను నీభక్తిచే సంతోషించినవాఁడనుగాన నీకోర్కెతీర్చెదను.

శ్లో॥ సౌమంగల్యవిహీనాచ కన్యకాచిరజీవినీ । అల్పాయురతిమేధావీ పుత్రోవాతవవాంఛితమ్ ॥

తా॥ సువాసినికానిదియుఁ జిరజీవియునైన పుత్రికకావలెనా? లేక ఎక్కువబుద్ధిమంతుడైన అల్పాయువుగల కుమారుఁడుకావలెనా?

శ్లో॥ బ్రూహీతిశంభునాప్రోక్తం శ్రుత్వోవాచ మహీపతిః। భగవన్ పరమానంద పరమేశ్వరశంకర ॥ కన్యకామాఽస్తుమేదేవ పుత్రందేహి దయానిధే ।

తా॥ ఈరెంటిలో నీకిష్టమైనదానిని గోరుమనఁగా నారాజు సాంబమూర్తిపలికిన వాక్యమువిని చెప్పుచున్నాడు ఓషడ్గుణైశ్వర్య సంపన్నుఁడా! పరమానందస్వరూపుడా! పరమేశ్వరుఁడా! ఓశంకర! కుమార్తెకన్న పుత్రుని దయచేయవలెను.

శ్లో॥ ఇతిశ్రుత్వామహాదేవ స్తథాఽస్త్వితి యుమయాసహ। గతేతు దేవదేవేశే రాజా స్వపురమాయయౌ ॥

తా॥ ఈప్రకారముగా రాజుచెప్పిన వాక్యమును దేవతలకు దేవుండైన సాంబమూర్తివిని నీవు కోరినట్లు నీకు పుత్త్రుడు కలుగునని చెప్పి పార్వతితోఁగూడి కైలాసమునకు వెళ్లెను చంద్రపాండ్యుఁడును తన పట్టణమునకు వెళ్లెను

శ్లో॥ తతః కుముద్వతీచంద్రపాండ్యాద్గర్భమవాపసా। తతస్తుదశమే మాసే శుభనక్షత్రసంయుతే । ప్రసూతపుత్త్రంసర్వజ్ఞం రాజలక్షణ సంయుతమ్ ।

తా॥ అనంతరమా కుముద్వతి భర్తవలన గర్భవతియై పది యవ మాసంబున యోగ్యమైన నక్షత్రముతోఁగూడిన సుముహూర్తమున మిక్కిలిజ్ఞానముకలవాఁడును రాజచిహ్నములుగలవాఁడును అగు పుత్త్రుని గనెను.

శ్లో॥ కృత్వాపుత్రోత్సవంరాజా బ్రాహ్మణేభ్యోధనందదౌ। తతశ్చ జాతకర్మాది కృత్వాసంతుష్టమానసః ॥ ఈశప్రసాదలబ్ధత్వా న్నామ చేశ్వరఇత్యపి । చకేృపితాత్వష్టమేఽబ్దే మౌంజీబంధనమాదరాత్ ॥

తా॥ ఆచంద్రపాండ్యమహారాజు పుత్త్రజననమునువిని బ్రాహ్మణులకు విశేషమైన ధనమును దానమిచ్చి సంతోషముతోఁ గూడిన వాఁడై జాతకర్మముచేసి యీశ్వరానుగ్రహమువల్ల ఈపుత్త్రుడు జన్మించెను కాబట్టి ఈశ్వరుండని నామకరణముచేసినవాడై యెనిమిదవ సంవత్సరమున ప్రేమతో ఉపనయనముగూడ జేసెను

శ్లో॥ జగ్రాహసకలావిద్యా అధ్వరణముఖాఃక్రమాత్ ॥

తా॥ ఆరాజుయొక్కపుత్త్రుఁడును క్రమముగా నధర్వణవేదము మొదలుగాఁగల సర్వవిద్యలను తెలిసికొనినవాడాయెను

శ్లో॥ సంప్రాప్తేషోడశేవర్షే రాజాచింతాపరాయణః। కథంపుత్త్రస్తు దీర్ఘాయు ర్భవతీతివిచారయన్ । వివాహానంతరంతస్య దృష్టవ్యమితి చింతయన్ ।

తా॥ ఆపిల్లవానికిఁ బదియాఱవ సంవత్సరమురాఁగానే రాజు వ్యాకులముగలవాఁడై నాకుమారుఁడెట్లు చిరజీవుండు కాఁగలఁడని

తలపోయుచు వివాహముచేసిన పిమ్మట నీవిషయము విచారింపఁదగిన దని నిశ్చయించుకొనెను.

శ్లో॥ ఏవంస్థితేసతితథా అలకాపురనాయకః। రాజామిత్రసహోనామ శివభక్తఉదారధీః ॥ కళావతీతస్యభార్యా భక్తేశ్వరపరాయణా । భక్తేశ్వరప్రసాదేన లబ్ధ్వాపుత్రింతు కన్యకామ్ ॥

తా॥ (అచ్చట నీరీతి నారాజు విచారించుచుండెను.) ఇది ఇట్లుండఁగా అలకాపట్టణమునకుఁ బ్రభువును శివునియందు భక్తిగలవాఁడును ఎక్కువైన బుద్ధిగలవాఁడునగు మిత్రసహుఁడనెడు రాజు గలఁడు ఆయనకుభక్తేశ్వరునియందాసక్తిగల కళావతియనుభార్యయు భక్తేశ్వరుని యనుగ్రహమువల్ల జనియించిన యొక పుత్త్రుఁడు నొక పుత్త్రికయును గలరు.

శ్లో॥ సంప్రాప్తయౌవనేకన్యాం దానంకర్తుమియేషసః ॥

తా॥ పుత్త్రికకు యౌవనమురాఁగానే వివాహము చేయుట కాయన నిశ్చయించుకొను చుండెను

శ్లో॥ తతస్తుమధురారాజ్ఞ స్సకాశాదాగతాన్నృపాః కన్యాంద్రష్టుం ముదాయుక్తా శ్శృత్వామిత్రసహస్తుతాఁ ॥ ఆహూయసంతుష్టమనాః కన్యాందాస్యామిపార్థివః। ఆగచ్ఛత్వతివేగేన రాజాసభ్రాతృబాంధవః॥

తా॥ అనంతరంబున మధురానగరమునకుఁ బ్రభువైన చంద్రపాండ్యునిచేఁ బంపఁబడిన రాజులు కన్యను జూచుటకు వచ్చినవారని యామిత్రసహుఁడు విని సంతోషముగలవాఁడై వారినిబిలిచి మర్యాద చేసి చంద్రపాండ్యుని పుత్త్రునకు నాకుమార్తెను యిచ్చెదను. అని చెప్పి వారందరిని సకుటుంబబంధుమిత్ర సహితముగా శీఘ్రముగా రమ్మనుఁడని చెప్పెను.

శ్లో॥ ఇతిశ్రుత్వానృపవచ స్సంప్రాప్య మధురాంపురీమ్ । రాజ్ఞేని వేదయామాసు ర్వృత్తాంతం సర్వమాదితః ॥

తా॥ ఈప్రకారముగా చెప్పిన యారాజు వాక్యమును విని మధురానగరమునకు వెళ్ళి ఆరాజునకావృత్తాంతమునంతయు సవిస్తారముగాఁ జెప్పినవారైరి.

శ్లో॥ ఆకర్ణ్యరాజాసంతుష్టో భార్యాబంధుసమన్వితః। అలకాపురీ యయాతూర్ణం రథాశ్వగజపత్తిభిః ॥

తా॥ వారుచెప్పిన వృత్తాంతము యావత్తు ఆచంద్రపాండ్యుడు విని సంతోషించి భార్యాబంధువులు మొదలైనవారితోను రథములు గుఱ్ఱములు, ఏనుగులు, మొదలగువానితోను సమస్తసేనలతోను శీఘ్రముగా నలకాపట్టణమునకు వెళ్ళినవారైరి.

శ్లో॥ ఆలోక్యరాజాతాన్ సర్వాన్ పౌర్ణమాస్యాం ముదాన్వితః। వివాహం కారయామాస శాస్త్రోక్తేనవైవవర్త్మనా ॥

తా॥ ఆ మిత్రసహుడును పెండ్లినిమిత్తము వచ్చిన చంద్రపాండ్యుడు మొదలైన సర్వజనులనుజూచి సంతోషించి వారికిఁదగినమర్యాదలుచేసి పూర్ణిమాదినమున శాస్త్రోక్తముగా వివాహము చేసెను.

శ్లో॥ కళావతీసుతస్యాంవై వ్రతోద్యాపనమాతనోత్ ॥

తా॥ ఆమిత్రసహుని భార్యయైన కళావతి ఆపూర్ణిమదినంబున క్రిందఁ జెప్పఁబోవురీతిని భక్తేశ్వరవ్రతోద్యాపనమును ఆచరించెను.

శ్లో॥ వేణుపాత్రింత్రయస్త్రింశత్స్వర్ణపట్టైరలంకృతః। చందనేన మహాలింగం భక్తేశ్వరసుసంజ్ఞితమ్ ॥ హరిద్రయాతథాగౌరీం సైకతేన వృషంతథా। సంపూజ్యవిధివద్రాత్రౌ గంధపుష్పాక్షతాదిభిః ॥ త్రయస్త్రింశద్వటాని నసూపఘృతశర్కరాః। త్రయస్త్రింశత్సకుదీపాన్ నిధాయవటకోపరి ॥ పుత్రీంకల్యాణినామ్నీంతు వస్త్రగంధాక్షతాదిభిః। హరిద్రాకజ్జలైశ్చైవ పుష్పచందనకుంకుమైః ॥ అలంకృత్య దదాతిస్యై తత్పాత్రిం భక్తిసంయుతా। మండలాదీపసూపాద్యైః పూరితం వేణుపాత్రికమ్। భక్తేశతుష్ట్యైదాస్యామి స్వర్ణపట్టైరలంకృతమ్। దాతృప్రతిగృహీతృభ్యాం సౌమంగల్యప్రదాయకమ్। పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం వ్రతసంపూర్తిహేతవే ॥

తా॥ మంచిగంధముచే లింగాకారముగా భక్తేశ్వరునిన్ని పసుపుచేఁ బార్వతినిన్ని ఇసుకచేనెద్దును నిర్మించినదై యారాత్రి గంధము పుష్పములు, అక్షతలు మొదలగువానిచేఁ బూజించి ముప్పదిమూడు

బంగారపుతీగెలచేఁ జుట్టఁబడిన వెదురుతలైకలో పప్పు, నెయ్యి, పంచ దారతోఁగూడిన ముప్పదిమూడు దోసెలనుండి యాదోసెలందుఁ పిం డితోఁ జేయఁబడిన ముప్పదిమూడు ప్రమిదెలనుంచి యాప్రమిదెల యందు దీపములను వెలిగించి కల్యాణియను పేరుగల తన పుత్రికకు చీరె, రెవిక, గంధము, అక్షతలు, పసుపు, కాటుక, కుంకుమ, పుష్పములు మొదలగువానిచే నలంకరించి దీపాదులచే నిండింపఁబడిన యాజల్లెడను శాస్త్రోక్తవిధిగా యిచ్చుచు ఇచ్చినవారికిని బుచ్చుకొన్నవారికిని భక్తే శ్వరుడను భగవంతుఁడు సంతసించి మాకుచిరకాలసువాసినీత్వమిచ్చు నట్లుగాను పుత్రులు మొదలగువారిని వృద్ధిపొందించునట్లుగాను వ్రతము పూర్తినొందునట్లుగాను భగవంతుఁడు రక్షించుగాక యని ఆమె కుమార్తెయైన వివాహస్త్రీకి వాయనదానముచేసెను.

శ్లో॥ ఇతిదత్వాతతఃకన్యాం ప్రేషయిత్వావరాంతికం। బంధుభిస్సహ భుక్త్వాతు సుఖమాస్తేయథాసుఖమ్ ।

తా॥ ఈప్రకారము కళావతి వ్రతోద్యాపనముచేసి పిమ్మట తన కుమార్తెను అల్లునివద్దకు పంపించి పిమ్మట తమ బంధువులతోఁ గూడి సుఖంబుగా భుజించినవారైరి

శ్లో॥ మృతస్సంహారకోయాత స్తయోశ్శయ్యాగృహంప్రతి । ఉద్ఘా టయోద్ఘాటయేతి కవాటమితిచాఽసకృత్ । ఇతికృత్వాహకల్యాణీ వాక్యంనోద్ఘాట్యతేతిసా ।

తా॥ ఆచిన్నది పెనిమిటివద్దకు వెళ్ళినపిమ్మట కాలమాసన్నమై అప్పుడు ప్రాణములను దీసికొనిపోవు మృత్యుదేవత ఆదంపతులున్న గదికివెళ్ళి తలుపుతీయుము తలుపుతీయుమని మాటిమాటికిఁ బలుకఁగా ఆమాట వివాహస్త్రీ విని యేకాంత సమయంబుగాన తలుపుతీయనని పలికెను.

మృత్యుః॥శ్లో॥ అహంమృత్యుస్తవపతిం నేతుమాల్పాయుమంతకాత్ ।

తా॥ మృత్యుదేవత చెప్పుచున్నది. నేను మృత్యుదేవతను, నీపెనిమిటికి ఆయుర్దాయము సమాప్తమైనది కాన నీక్షణంబే తీసికొని వెళ్ళుటకుగాను వచ్చితినని నెను.

కల్యాణీ॥ (వివాహస్త్రీ) శ్లో॥ భక్తేశ్వరప్రసాదాత్తు సౌమంగల్యాది సంపదా। స్థితాఽహంతస్యనికటే కథమాగమ్యతేత్వయా। గచ్ఛ గచ్ఛేతితంచోక్త్వా శరణం పాపహారిణమ్। భక్తేశ్వరదయాసింధో శరణాగతవత్సల। మృత్యుగ్రస్తాంమమపతిం రక్షరక్షదయానిధే॥

తా॥ ఓమృత్యుదేవతా! భక్తేశ్వరస్వామియొక్క యనుగ్రహముచే దీర్ఘసువాసినీత్వము మొదలగు సంపత్తుకలదానినై నాపెనిమిటి సమీపమందుంటిని నీవిచ్చటికెట్లు రాగలవు పో పొమ్మని మృత్యుదేవతతోఁ బలికి ఓభక్తేశ్వరస్వామీ! అపారమైన దయగలవాఁడా! రక్షింపుముసుము ఓ ఈశ్వరా! కరుణకు స్థానమైన ప్రేమగలవాఁడా! నా పెనిమిటిని మృత్యువువల్ల విడిచిపెట్టించి నన్ను రక్షింపుము రక్షింపుమని మూ పాపములను నశింపచేయునట్టియు రక్షకుఁడునైన భక్తేశ్వరస్వామిని పలువిధములుగా-ఆ కళ్యాణి ప్రార్థించెను

శ్లో॥ ఏతస్మిన్నంతరేమృత్యుః క్రుద్ధస్సంరక్తలోచనః। పాదప్రహారైర్బహుశః ఉద్ఘాట్యచకవాటకమ్॥ గృహీతుమాగతస్తూర్ణం తదాశంభుర్దయానిధిః। దీపన ఘంభోగయుక్తః కాలసర్పోబభూవహ। మృత్యుం దదంశకోపేన ఈశోభక్తార్తిభంజనః। నష్టోమృత్యుః పపాతాఽథ విస్మృతాక్షోభయంకరః॥

తా॥ ఇంతలో మృత్యుదేవత కోపించి యెఱ్ఱనైన కన్నులుగలదై తలుపు ననేకసార్లుతన్ని బద్దలుకొట్టి లోపలఁ బ్రవేశించి శీఘ్రముగా నా మొగుని దీసికొనిపోవ ప్రయత్నించుచుండగా అప్పుడు దయాసముద్రుడైనటువంటి భక్తుల యాపత్తును దొలఁగఁద్రోయు సాంబమూర్తి యచ్చటనుండు దీపములను పడిగెలనుగాఁ జేసికొని పరమేశ్వరుడు నల్లని గొప్ప సర్పమై రోషముతోఁగూడి కఱవఁగా ఆ మృత్యుదేవత కన్నులు తెఱచి ప్రాణంబువిడిచి భయంకరాకారముతో క్రిందబడెను.

శ్లో॥ దృష్ట్వాకుచిత్రగుప్తాద్యాః ప్రార్థయంత ఉమాపతిం। ఈశస్సంప్రార్థనాత్తుష్టశ్చిత్రగుప్తముమువాచహ॥

తా॥ చిత్రగుప్తుఁడు మొదలైన యమభటులీచర్యఁజూచి సాంబ

మూర్తిని బ్రార్థింపఁగాఁ ఆ యీశ్వరుఁడు సంతోషించి చిత్రగుప్తుతో నొక వాక్యమును బలికెను.

శ్లో॥ కల్యాణీయంతుమద్భక్త్యా కృతభక్తేశ్వరవ్రతా । తస్యాఃపతిం కథంహంతు మాగతోదండభృత్సయమః ॥

తా॥ ఓచిత్రగుప్తా! కల్యాణి అను చిన్నది నాయందు భక్తి గలదై భక్తేశ్వరవ్రతము నాచరించినదామెకు ఈ వృత్తాంతంబు తెలిసియు ఈచిన్నదాని పెనిమిటిని జంపుటకు యముఁడు ఎట్లువచ్చెను.

శ్లో॥ భవత్వితఃపరంత్వేవం నాగంతవ్యం యమంప్రతి। క్షమాకృతా మయాయూయం ధర్మరాజేన సంప్రతి ॥ గంతవ్యాఇతితానుక్త్వా ఉమయాసహితశ్శివః । వత్సేకల్యాణిమాభూత్తే భీతిర్భర్తృవధాదితి॥ భక్తేశ్వరవ్రతంపుణ్యం త్వయాకార్య మితఃపరం । మత్ప్రసాదాత్తవపతి ర్దీర్ఘాయుఃపుత్రవాన్సుఖీ।ఇతిదత్వావరంతస్మై భక్తేశో౽ంతరధీయత॥

తా॥ ఈవఱకుఁ దెలిసియో తెలియకయో చేసెను. గాన మృత్యుదేవత నేనును క్షమించితిని ఇంతటనుంచి నాయందు భక్తిగలవారివద్దకు రాకూడదు ఇప్పుడు మీరు యమునితోఁగూడ మీలోకంబునకుజనుఁడని యముని ప్రాణసహితునిగాఁజేసిపంపి యనంతరమీశ్వరుఁడు పార్వతితోఁ గూడినవాఁడై, ఓ కల్యాణి నీభర్తకు ఆయుర్దాయమిచ్చితిని పుణ్యప్రదమైన భక్తేశ్వరవ్రతము నీవుచేయుము అందువలన నీభర్త పుత్రవంతుఁడును సుఖవంతుఁడునై చిరకాలము జీవింపగలడని ఆ చిన్నదానికి వరమిచ్చి కైలాసంబున కేగెను.

శ్లో॥ తతస్సుఖేనకల్యాణీ సహభర్త్రావిహృత్యచ । పరేద్యుఃప్రాతరుత్థాయ ప్రావ్యకల్యాణమంటపం । వధూవరౌతతస్తత్ర కృతకౌతుకమంగళౌ ॥

తా॥ అనంతరం బాకల్యాణి పెనిమిటితో సుఖముగా విహరించి మేఱునాఁ డుదయంబునలేచి మంగళప్రదమైన యలంకారంబులతోఁ గూడి వివాహ మంటపమునకు వెళ్ళెను.

శ్లో॥ మధురేశస్తస్యభార్యా పుత్రస్యాయుర్విచింతయన్ । ఇతఃపరం స్సుమహాభాగ్య వశాద్దీర్ఘాయుస్త్వితి । ఇతిచింతయతస్తత్ర కళా

వత్స్యాఽలకేశ్వరః । ఆహ్వానార్థం వాద్యఘోషై ర్గత్వాసంబంధినో గృహం । ఆహూతౌతుముదాయుక్తౌ తదాకల్యాణమంటపమ్॥

తా॥ చంద్రపాండ్య మహారాజు కుముద్వతియుఁ బుత్రుని యల్పాయుర్దాయమునుగూర్చి విచారపడుచు నింతటనుండి మనకోడలి భాగ్యముచే మనకుమారుండు దీర్ఘాయుష్మంతుఁడు కావలెనుగాని మనచే నేమగునని యాలోచింపుచుండఁగా మిత్రసహుఁడు భార్యతోఁ గూడి మంగళవాద్యములతో వచ్చినపిమ్మట చంద్రపాండ్యుని కుముద్వతిని తన గృహంబునకు బ్రవేశపెట్టిరి.

శ్లో॥ దృష్ట్వావధూవరౌప్రీతా స్నుషాంప్రాహకుముద్వతీ । బాలే కళ్యాణిహేవత్సే తత్వంమేబ్రూహిపృచ్ఛతః । ఏషోఽల్పాయుశ్చమే పుత్ర స్త్వద్భాగ్యాద్బహుజీవతు । ఇతికృత్వామతింసుభ్రు ఉద్వాహం కారితంమయా । కేనవ్రతప్రభావేన దీర్ఘాయురభవత్పతిః ॥

తా॥ అక్కడ పుత్రుని కోడలినిజూచి సంతోషించి కుముద్వతి కోడలివద్దకువెళ్ళి యిట్లనియె ఓ చిన్నదానా! కల్యాణీ! మా కుమారుఁ డల్పాయుర్దాయము గలవాఁడైనను నీభాగ్యముచేఁ జిరకాలము జీవించగలడని నాలోచించి మీయిద్దఱికిఁ బెండ్లిజేసితిమి. ఏవ్రభావముచే నీపెనిమిటి దీర్ఘాయుష్మంతుఁడయ్యెనో దెల్పుము.

శ్లో॥ తతస్సారాత్రివృత్తాంత మాహశ్వశ్రోర్ముదాన్వితా।శ్రుత్వాసం హృష్టహృదయాతామాలింగ్యముహూర్ముహుః॥తద్వ్రతంమమచబ్రూహికరిష్యామిసుమధ్యమే।ఈశ్వరోక్తప్రకారేణసర్వంవ్యాకథయత్తదా॥

తా॥ అనంతరం బా కల్యాణి రాత్రిజరిగిన వృత్తాంతమును అత్తమామలతోఁజెప్పఁగావిని సంతోషించిన మనస్సుగలవారై కోడలిని మాటిమాటికి అత్తగారు ఆలింగనముచేసికొని భక్తేశ్వర వ్రతవిధానమును నాకుఁ జెప్పుమని యత్తగారు యడుగఁగా నారాత్రి సాంబమూర్తి చెప్పినరీతి నంతయు కల్యాణి కుముద్వతికిఁ జెప్పెను

శ్లో॥ శ్రుత్వావ్రతప్రభావంతు వ్రతంచక్రే కుముద్వతీ । తేనవ్రతప్రభావేన పుత్రపౌత్రసమన్వితా। మధురాంప్రాప్యసస్నేహః పుత్రపౌత్రసమన్వితః॥భుంజానోవివిధాన్భోగా సుఖమాస్తేయథాసుఖమ్॥

తా॥ కుముద్వతి కోడలు చెప్పిన వ్రతప్రభావమును విని యా వ్రతము నాచరించి దాని మహిమచేఁ బుత్త్రుఁడు మొదలైన సంపత్తులతోఁగూడి స్వకీయమైన మధురానగరమునకుఁజని చంద్రపాండ్యుఁడును కుముద్వతియుఁ బుత్రుఁడును కోడలును బరస్పరస్నేహముగలవారై యనేకమైన భోగముల ననుభవింపుచు సుఖముగానుండిరి.

శ్లో॥ తదాప్రభృతిలోకేఽస్మిన్ వ్రతం భక్తేశ్వరాభిధం। ఇతిహ్యకథయత్తత్ర పార్వతీం పరమేశ్వరః॥

తా॥ అదిమొదలుకొని భూలోకమున భక్తేశ్వరవ్రతము చేయఁబడుచున్నదని కైలాసంబున పార్వతికి శివుఁడు చెప్పెను.

శ్లో॥ భక్తేశ్వరవ్రతమిదం పౌర్ణమాస్యాం విధీయతే॥

తా॥ ఈభక్తేశ్వరవ్రతముపూర్ణిమాదినమునముఖ్యముగాజేయఁదగినది.

శ్లో॥ నారీసామాన్యమేతద్ధి వ్రతం భక్తేశ్వరాభిధం। కరోతిభక్త్యాయానారీ వ్రతమేతచ్ఛివప్రియం॥ సంప్రాప్య పుత్త్రపౌత్త్రాదీన్ సౌమంగల్యాదిసంపదః ఇహభుక్త్వామహాభోగాన్ సదాశివపదంవ్రజేత్॥

తా॥ ప్రతి స్త్రీ యీవ్రతము తప్పక చేయువలయును. ఏ స్త్రీ భక్తికలదై మంగళప్రదంబు ప్రియంబునగు నీవ్రతమును జేయునో ఆ స్త్రీ పుత్త్రులు, మనుమలు చిరకాలము సువాసినిగా నుండుట యీ మొదలగు సంపత్తులనుబొంది యీలోకమునందు గొప్పసౌఖ్యమనుభవించి జన్మాంతమునఁ గైలాసంబున కేగెను.

శ్లో॥ ఇతిసూతవచశ్శ్రుత్వా ఋషయస్తుష్టమానసాః। సర్వాభిఋషిపత్నీభిః కారయామాసురైశ్వరం। తదాప్రభృతిలోకేఽస్మిన్ ప్రసిద్ధమభవత్ తత్॥

తా॥ శౌనకాది మునీశ్వరు లీప్రకారము సూతమహాముని చెప్పిన వ్రతమును విని సంతోషచిత్తులై తమతమ భార్యలచే భక్తేశ్వరవ్రతమును జేయించిరి అది మొదలీ భూలోకమందు భక్తేశ్వరవ్రతము ప్రసిద్ధికెక్కి యుండెను.

ఇతి భవిష్యోత్తరపురాణే ఉమామహేశ్వర సంవాదె
భక్తేశ్వరవ్రతకల్పస్సంపూర్ణః.

# కృత్తికా దీప వ్రత కల్పః

## పూజావిధానమ్

ఏవంగుణ ... శుభతిథౌ। ఉమామహేశ్వరముద్దిశ్య। ఉమామహేశ్వరప్రీత్యర్థం ఉమామహేశ్వర ప్రాణప్రతిష్ఠాపన పూర్వకసంభవద్భిర్ద్రవ్యై స్సంభవద్భిః పదార్థై స్సంభవద్భి రుపచారై స్సంభవతా నియమేన యావచ్ఛక్తి ధ్యానావాహనాది కల్పోక్తవిధానేన షోడశోపచారపూజాం కరిష్యే॥ తదంగకలశారాధనం కరిష్యే। కలశస్య ముఖే... సమాశ్రితాః। ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషువర్ధతే॥ ఆపోవా ఇదగ్ం సర్వం... సన్నిధింకురు। ఆయాంతు ఉమామహేశ్వరపూజార్థం దురితక్షయకారకాః॥ కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య॥ దేవద్రవ్యాణి సంప్రోక్ష్య। ఆత్మానంచ సంప్రోక్ష్య। తదంగ ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే। అస్య ఉమామహేశ్వర ప్రాణప్రతిష్ఠా మహామంత్రస్య। బ్రహ్మవిష్ణు మహేశ్వరా ఋషయః ఋగ్యజుస్సామాథర్వణానిఛందాంసి ప్రాణశక్తి పరాదేవతా ఆం-బీజం, హ్రీం-శక్తిః, క్రోం-కీలకం, మమసర్వాభీష్ట ఉమామహేశ్వర ప్రాణప్రతిష్ఠాసిద్ధ్యర్థే జపే వినియోగః॥ అం-కం-ఖం-గం-ఙం-ఆం। పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మనే। ఆం-అంగుష్ఠాభ్యాంనమః॥ ఇం-చం-ఛం-జం-ఝం-ఞం-ఈం-శబ్దస్పర్శరూప రసగంధాత్మనే। ఈం-తర్జనీభ్యాంనమః॥ ఉం-టం-ఠం-డం-ఢం-ణం-ఊం। త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాత్మనే। ఊం। మధ్యమాభ్యాంనమః॥ ఏం-తం-థం-దం-ధం-నం-ఐం వాక్పాణిపాదపాయూపస్థాత్మనే। ఐం-అనామికాభ్యాంనమః॥ ఓం-పం-ఫం-బం-భం-మం-ఔం। వచనాదానగమన విసర్జనానందాత్మనే। ఔం-కనిష్ఠికాభ్యాంనమః॥ అం-యం-రం-లం-వం-శం-షం-సం-హం-ళం-క్షం-అః। మనోబుద్ధిచిత్తాహంకారాత్మనే। ఓం అః కరతలకరపృష్ఠాభ్యాంనమః॥ ఏవం హృదయాదిన్యాసః॥ ధ్యానమ్॥

శ్లో॥ రక్తాంభోధిస్థపోతోల్లసదరుణ సరోజాధిరూఢా కరాబ్జైః। పాశంకోదండ మిక్షూద్భవమణిగుణ మప్యంకుశం పంచబాణాన్ । బిభ్రాణాసృక్కపాలాత్రినయనసహితా పీనవక్షోరుహాఢ్యా । దేవీ బాలార్కవర్ణాభవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః॥ హ్రాం హ్రీం క్రోం-య-ర-ల-వ-శ-ష-స-హోం-క్షం - హంసః ఉమామహేశ్వర ప్రాణః ఇహప్రాణాః॥ ఓం-ఆం-హ్రీం-క్రోం- య-ర-ల-వ-శ-ష-స-హోం। హంసః। ఉమామహేశ్వర జీవఇహస్థితాః । ఓం-ఆం-హ్రీం-క్రోం య-ర-ల-వ-శ-ష-స-హోం । హంసః । ఉమామహేశ్వరస్య వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణా ఇహైవాఽగత్య సుఖం చిరం తిష్ఠంతుస్వాహా ॥ ఓం అసునీతే ...ఉపహ్వయతే ॥ స్థిరోభవ... కురు॥ తతః ధ్యానం॥ హృత్పద్మ...రు ॥ శ్లో॥ కైలాసే కమనీయరత్నఖచితే కల్పద్రుమూలేస్థితమ్॥ కర్పూరస్ఫటికేందు సుందరతనుం కాత్యాయనీ సేవితమ్। గంగాతుంగతరంగరంజిత జటాభారం కృపాసాగరం । కంఠా లంకృతశేషభూషణమహం మృత్యుంజయంభావయే ॥ శ్లో॥ విశ్వతః పాదపాదాబ్జం విశ్వతోక్షిశిరోముఖం। జ్వలంతం విశ్వమావృత్య తేజో రాశిం శివంస్మరేత్ ॥ శ్లో॥ ముక్తాలంకృత సర్వాంగమిందుగంగాధరం హరం। ధ్యాయేత్కల్పతరోర్మూలే సుఖాసీనంసహోమయా॥ శ్లో॥ చంద్రికాయుప్రతీకాశం త్రినేత్రం చంద్రభూషణం । ఆపింగళజటా జూటం రత్నమౌళివిరాజితమ్ ॥ శ్లో॥ నీలగ్రీవముదారాంగం తారాహా రైశ్చశోభితం। వరదాభయహస్తంచ హరంచపరమేశ్వరమ్॥ శ్లో॥ దధా నంనాగవలయం కేయూరాంగదముద్రికాం। వ్యాఘ్రచర్మపరీధానం రత్నసింహాసనేస్థితమ్ ॥ శ్లో॥ ధ్యాత్వాతద్వామభాగేతు చింతయేద్గిరి కన్యకాం । భాస్వజ్జపాప్రసూనాభా ముదయార్కసమప్రభామ్॥ శ్లో॥ విద్యుత్పుంజనిభాంతన్వీం మనోభువననందినీం । బాలేందుమకుటాం స్నిగ్ధాంనీలకుంచితకుంతలామ్ శ్లో॥ భృంగావళియుసంయుక్తాం నీలాల కవిభూషితాం । మణికుండలవిద్యోతి ముఖమండలవిభ్రమామ్ ॥ శ్లో॥ నవకుంకుమ పంకాంగీం కపోతలదర్పణాం కంబుకంఠాంశివా ముద్ర ...ము ... ॥ శ్లో॥ ...గదాదేశ్య విలసంతీ...

చతుర్భుజాం। అనేకరత్నవిలసద్దివ్య కాంచీగుణాన్వితామ్। శ్లో॥ దిక్పాల
వనితామాలి విన్యస్తాంఘ్రి సరోరుహాం । రత్న సింహాసనారూఢాం
సర్వైశ్చ పరిసేవితామ్ ॥ శ్లో॥ ఏవంధ్యాత్వామహాదేవీం గౌరీంచగిరి
కన్యకాం । మీఢుష్టమ...ఆచరపినాకమ్॥ శ్రీ ఉమామహేశ్వర...
నమః॥ ధ్యానం। శ్లో। ఆగచ్ఛమృత్యుంజయ చంద్రమౌళే వ్యాఘ్రాజి
నాలంకృతశూలపాణే । స్వభక్తసంరక్షణకామధేనో ప్రసీదసర్వేశ్వర
పార్వతీశ। నమస్తే రుద్రమన్యవ...ఉచితేనమః॥ ఉమామహేశ్వర...
నమః॥ ఆవాహనం సమర్పయామి। శ్లో। భాస్వన్మౌక్తికతోరణై ర్మరకతస్తంభాయుధాలంకృతే। సౌధేధూపసువాసితే మణిమయేమాణిక్య
దీపాంచితే। బ్రహ్మేంద్రామరయోగిపుంగవ గణైర్యుక్తేచకల్పద్రుమై।
శ్రీమృత్యుంజయ సుస్థిరోభవవిభో మాణిక్యసింహాసనే॥ యాతఇషు
శ్శివ...మృడయ। శ్రీ ఉమామహేశ్వర...నమః॥ అనేకనవరత్నసిం...
యామి। శ్లో॥ మందారకమల్లీ కరవీరమాధవీ పున్నాగనీలోత్పల చంప
కాన్వితైః । కర్పూరపాటీరసువాసితైర్జలై రాధత్స్వమృత్యుంజయ
పాద్యముత్తమమ్। యాతెరుద్రశివాతనూ...కశీహి। శ్రీ ఉమామహే
శ్వర...నమః॥ పాదయోః పాద్యంసమర్పయామి। శ్లో। సుగంధపుష్ప
ప్రకరైస్సువాసితై ర్వియన్నదీశీతలవారిభిశ్శుభైః। త్రైలోక్యనాథార్తి
హారార్ఘ్యమాదరా ద్గృహాణమృత్యుంజయ సర్వవందితా । యామి
షుంగిరిశంత ... పురుషం జగత్ । శ్రీ ఉమామహేశ్వర...నమః ।
హస్తయోరర్ఘ్యం...యామి। శ్లో॥ కర్పూరవాసితైస్తోయై శ్శీతలైరతి
పావనైః। మృత్యుంజయమహాదేవ శుద్ధాచమనమాచర॥ శివేనవచసా
...సత్। శ్రీ ఉమామహేశ్వర...నమః । ముఖే ఆచమనీయం ...
యామి॥ శ్లో। గుడదధిసహితం మధుప్రకీర్ణం సుఘృతసమన్విత సుధు
గ్ధయుక్తమ్। శుభకరమధుపర్కమాహర త్వంత్రిణయనశంకర త్రిలోక
వంద్య॥ అధ్యవోచదధివక్తా...యాతుధాన్యః॥ శ్రీ ఉమామహేశ్వర
...నమః॥ మధుపర్కం...యామి॥ పంచామృతస్నానం॥ ఆప్యాయస్వ
...ధే। దధి...కరత్। శుక్ర...రశ్మిభిః॥ స్వాదుఃపవన ... అదాభ్యా।
[illegible]

పంచామృతస్నానం ... యామి ॥ శ్లో॥ జగత్త్రయీఖ్యాత సమస్తతీర్థై
స్సమాహృతైః కల్మషహారిభిశ్చ। స్నానం సుతోయైరవధారయత్వం
మృత్యుంజయానంతగుణాభిరామ॥ అస్మాయస్త్వా మా॥...దిక్షు। ఆపో
హిష్ఠా...చనః। నమస్సోమాయ...శివతరాయచ॥ శ్రీ ఉమామహే
శ్వర ... నమః ॥ శుద్ధోదకస్నానం ... యామి॥ శ్లో॥ దర్పణప్రతిమం
శుభ్రం కౌశేయం నేత్రసుందరమ్। ధారయానంతవమ్మృదులం మృత్యుం
జయ మహాప్రభో॥ శ్రితాస్స...విలోహితః॥ శ్రీఉమామహేశ్వర...
నమః ॥ వస్త్రయుగ్మం ... యామి॥ శ్లో॥ విశుద్ధముక్తాఫలజాలవంద్య
మనోహరం కాంచనసూత్రయుక్తం । యజ్ఞోపవీతం వరమం పవిత్రం
హాహాస్వమృత్యుంజయ భక్తిగమ్యమ్ ॥ ఉపైనం...యాతినః । శ్రీ
ఉమామహే...నమః॥ యజ్ఞోపవీతం...యామి ॥ మాణిక్యకేయూర
కిరీటహారైః కాంచీమణిస్థాపితకుండలైశ్చ। మంజీరముక్తాభరణైర్మనోజ్ఞై
రంగాని మృత్యుంజయభూషయామి ॥ శ్రీ ఉమామహేశ్వర ... నమః॥
ఆభరణాని సమర్పయామి ॥ త్ర్యంబకం...మృతాత్ ॥ శ్రీ ఉమా...
నమః ॥ త్ర్యంబకం స...యామి॥ శ్లో॥ శ్రీగంధం ఘనసారకుంకుమ
యుతం కస్తూరికాపూరితం । పాత్రేయేనహిమాంజనా విరచితం మం
దారసంవాసితమ్ ॥ దివ్యం దేవమనోహరం మణిమయేపాత్రే సమారో
పితం । సర్వాంగేషువిలేపయామి సతతం మృత్యుంజయ శ్రీనిధే ॥
నమోఅస్తు నీలగ్రీవా...కరంనమః ॥ శ్రీఉమా...నమః ॥ గంధం...
యామి॥ శ్లో॥ అక్షతైర్ధవళైర్దివ్యై స్సమ్యక్తిలసమన్వితైః । మృత్యుం
జయమహాదేవపూజయామి వృషధ్వజ॥ ఆయనేతే...ఇమే॥ శ్రీఉమా
...నమః ॥ అక్షతాన్ స...యామి ॥ నిధనపతయే...సదాశివోం ॥
శ్లో॥ చంపకపంకజకుందైశ్చ కేసరకరవీరమల్లికాకుసుమైః।విస్తారయామి
తేజూటం మృత్యుంజయ పుండరీకనయనాప్త॥ ప్రముంచధన్వాభగవో
పప॥ శ్రీఉమా...నమః॥ పుష్పాణి పూజయామి ॥

అథాంగపూజా॥ మహేశ్వరాయనమః పాదౌపూజయామి॥
ఈశ్వరాయనమః। జంఘేపూజయామి॥ కామరూపాయనమః జానునీ

పూజయామి॥ హరాయనమః। ఊరూపూజయామి॥ త్రిపురాంతకాయ నమః। గుహ్యంపూజయామి। భవాయనమః। కటింపూజయామి॥ గంగాధరాయనమః। నాభింపూజయామి॥ పశుపతయేనమః। హృదయం పూజయామి॥ పినాకినేనమః। హస్తౌపూజయామి। శివాయనమః। భుజౌపూజయామి॥ శితికంఠాయనమః। కంఠంపూజయామి। విరూపాక్షాయనమః। ముఖంపూజయామి॥ త్రినేత్రాయనమః। నేత్రాణిపూజయామి। రుద్రాయనమః। లలాటంపూజయామి। శర్వాయనమః। శిరః పూజయామి॥ చంద్రమౌళయేనమః। మౌళింపూజయామి॥ పశుపతయేనమః। సర్వాణ్యంగానిపూజయామి। శ్లో॥ త్రిదళంత్రిగుణాకారం త్రినేత్రంచత్ర్యాయుధం। త్రిజన్మపాపసంహార మేకబిల్వంశివార్పణమ్॥ శ్లో॥ త్రిశాఖైర్బిల్వపత్రైశ్చ అచ్ఛిద్రైఃకోమలైశ్శుభైః। తవపూజాం కరిష్యామి ఏక...ర్పణమ్॥ శ్లో॥ దర్శనంబిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనం। అఘోరపాపసంహార మేకబిల్వం శివార్పణమ్॥ శ్లో॥ కాశీక్షేత్రేనివాసంచ కాలభైరవదర్శనం। ప్రయాగమాధవందృష్ట్వా ఏక ర్పణమ్॥ శ్లో॥ తులసీబిల్వనిర్గుండీ జంబీరామలకంతథా। పంచబిల్వమితిఖ్యాత మేక...ర్పణమ్॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాప్యంశివాలయం। కోటికన్యామహాదాన మేక...ర్పణమ్॥ నిధనపతయేనమః। ఓం...పాణిమంత్రంపవిత్రం। శివాష్టోత్తరశతనామపూజాంచకృత్వా॥ శ్లో॥ కర్పూరచూర్ణా కపిలాజ్యపూతా దాస్యామికాలేయసమన్వితాశ్చ సముద్భవాన్పావనగంధధూపా న్మృత్యుంజయాంగం పరిరంజయామి॥ అవతత్య...సుమనాభవ। వనస్పతి...ప్రతిగృహ్యతామ్॥ శ్రీ ఉమామహేశ్వర...నమః॥ ధూపమాఘ్రాపయామి॥ శ్లో॥ వర్తిత్రయోపేత మఖండదీప్త్యా తమోహరంబాహ్యమథాంతరంచ। సాజ్యంసమస్తామర యోగిహృద్యం సురేశమృత్యుంజయ పశ్యదీపమ్॥ విద్యుద్ధనుః...నిషంగధిః॥ సాజ్యమేకా...నమోస్తుతే॥ శ్రీఉమా...నమః॥ దీపందర్శయామి। ఆచమనీయం సమర్పయామి॥ శ్లో॥ రాజాన్నం దధిశర్కరా మధుయుతం మాణిక్యపాత్రేస్థితం। హింగుజీరకసన్మరీచమిళితై శ్శాకై [illegible] నాగసూపసహితం సద్యోఘృతేనాప్లు

తం। శ్రీ మృత్యుంజయసుస్థిరోభవ విభోసాపోశనం భుజ్యతామ్॥ శ్లో॥ మక్షికాః మశకాస్కేశా స్తృణబీజానివల్కలాః । పాషాణమృత్తికాదీని క్రిమికీటాని సంతివై । శ్లో ॥ ఏతత్సర్వం పరిత్యజ్య శుచిపాకాని యానివై। తానిసర్వాణిగృహ్ణీష్వ క్షమస్వపరమేశ్వర॥ యాతేహేతి... భుజ॥ శ్రీమహా...నమః । మహానై వేద్యం సమర్పయామి । శుద్ధాచమ న...యామి॥శ్లో॥ మాక్తికచూర్ణ సమేతై ర్మృగమదఘనసారవాసితైః॥ పూగీఫల సమేతై స్తాంబూలం మృత్యుంజయ సమర్పయామి। నమస్తే అస్త్వాయుధాయ... నే॥పూగీ .. తామ్॥శ్రీ ఉమా.. నమః॥ తాంబూలం ...యామి॥ తాంబూలానంతరమాచమనీయం...యామి॥ శ్లో॥ నీరాజనం నిర్మలదీప్తవద్భిర్దీపాంకురై ర్నిర్మలతేజసాచ । ఘంటానాదం కుర్యాత్ ॥ మృత్యుంజయాయ త్రిపురాంతకాయ ॥ పరితేధన్వనే ...నిధేహితం ॥ హిరణ్మపాత్రం ..దీర్ఘమా యుః॥ శ్రీఉమా...నమః॥ కర్పూరనీరాజనం.. యామి నీరాజనానంతరమాచమనం...యామి॥ నక్షత్రహారతి ఉత్తరనీరాజనం ॥ సర్వప్రిజాం మే ... నిత్యమంగళాని భవంతు॥ మంత్రపుష్పం॥ ఆత్మప్రదక్షిణనమస్కారాః సమర్పయామి॥ ఛత్రింసమర్పయామి॥ యస్య ..సమర్పయామి॥ శ్లో॥ జలరూప జలావాస జలాధీశజలప్రియ। జలమధ్యేమహాదేవ స్నానంకురునమోస్తుతే॥

ఇతి పూజావిధానం సంపూర్ణమ్.

# కృత్తికాదీపవ్రతకథారంభః.

నారదఉవాచ॥శ్లో॥ సర్వదేవేశసర్వజ్ఞ సర్వలోకనమస్కృత। వ్రతం బ్రూహి మహాబాహో సర్వలోకోపకారకమ్ ॥

తా॥ బ్రహ్మదేవునిగుఱించి నారదుఁడు ప్రశ్నించుచుండెను. సమస్తదేవనాయకా, సర్వమును తెలిసిన ఓ మహానుభావ, సమస్తలోకములయందు జనులు నమస్కరించబడుచుండువాఁడా, గొప్ప భుజములుగలవాఁడా, బ్రహ్మదేవుఁడా, సర్వలోకముల కుపకారమగు వ్రతమును చెప్పుము.

బ్రహ్మోవాచ ॥ శ్లో॥ కృత్తికాయోగమాహాత్మ్యం కార్తికాస్యాం శృణునారద । యస్యశ్రవణమాత్రేణ అభీష్టఫలమాప్నుయాత్ ॥

తా॥ ఆమాటవిని బ్రహ్మదేవుఁడు ఇట్లు పలికెను ఓనారదా! కార్తికమాసమందు కృత్తికా నక్షత్రయోగ మహిమను చెప్పెదను వినుము. దీనిని విన్నంతనె కామితార్థములు సిద్ధించగలవు.

శ్లో॥ కృత్తికావ్రతమాహాత్మ్యం వ్రతం త్రైలోక్యదుర్లభం । సర్వపాపక్షయకర మాయుర్వర్ధన ముత్తమమ్ ॥

తా॥ యీ కృత్తికాదీపవ్రతము సమస్త పాపములను నశింపచేయును ఆయువును వృద్ధిచేయును మూఁడులోకములందును యిది బహుదుర్లభము గాన తప్పక చేయదగినది.

శ్లో॥ పుత్రప్రదమపుత్రాణాం దరిద్రాణాంధనప్రదం। పురుషాణాం గృహస్థానాం భోగమోక్షప్రదాయకం। వనస్థానాంయతీనాంచ జ్ఞాన వైరాగ్యకారణం। స్త్రీణామావశ్యకంబ్రహ్మన్ వ్రతంసర్వసమృద్ధిదమ్॥

తా॥ కృత్తికాదీపవ్రతఫలమును జెప్పెదను సంతానములేనివారికి సంతానమును, ధనములేనివారికి ధనమును, గృహస్థులకు యిహభోగములను, పరలోక భోగములను కలుగజేయును. వానప్రస్థులకు, యతులకు జ్ఞానవైరాగ్యముల నిచ్చును. స్త్రీలకు మహాపుణ్యప్రదము. తప్పక చేయదగిన వ్రతము. సమస్త సంపత్తుల నిచ్చును.

శ్లో॥ సువాసినీనాందేవర్షే విధవానామపిదుర్లభం। కృత్తికాదీప మాహాత్మ్యం కర్తవ్యం పాపనుత్తయె ॥

తా॥ ముత్తైదువులకును, విధవలకును, పాపనాశనమునకై చేయఁదగిన వ్రతము.

శ్లో॥ పాపానిబహువస్సంతి స్త్రీణాంచైవపదేపదే। తత్పాపంవర్ణితుం శక్యం నమయాముని పుంగవ।తథాపివక్ష్యేసంక్షేపాల్లోకోద్ధరణహేతవే॥

తా॥ స్త్రీలకు ప్రతిపిషయమందును పాపములు తప్పక సంభవించుచుండును ఆ పాపములను వర్ణించుటకు నాతరముగాదు. అయినను సంక్షేపముగా ఆడవారికిగలిగెడి పాపములను చెప్పెదను వినుము;—

శ్లో॥ పతివాక్యమనాదృత్య స్వతంత్రాత్మానువర్తతే। సప్తజన్మసు దేవర్షే సూతకత్వమవాప్నుయాత్ ॥

తా॥ భర్తమాటవినక స్వతంత్రముగా నడిచెడి స్త్రీ యేడు జన్మలం సూతకత్వమును బొందును.

శ్లో॥ ఆపోశనంచాసనంచ యానారీనప్రయచ్ఛతి। సాగోహత్యాకృతంపాపం ప్రాప్నుయాన్నాత్రసంశయః ॥

తా॥ భర్తకు కూర్చుండుటకు ఆసనమును, హస్తమందుఆపోశనమును యివ్వని స్త్రీ గోవును చంపినపాతకమునుబొందును సందేహము లేదు.

శ్లో॥ యాఃకుర్వంతిస్త్రియోలోకే మాతాపిత్రోశ్చవిప్రియం। సప్తజన్మభవేత్స్త్రీత్వం వైధవ్యంచపునఃపునః ॥

తా॥ తల్లిదండ్రుల కపకారమాచరించు స్త్రీలు యేడు జన్మములందు ఆడవారై జన్మించి వైధవ్యమును బొందు చుందురు.

శ్లో॥ సంగమాయ సమాహూతా యానారీనప్రయచ్ఛతి। సప్తజన్మభవేత్స్త్రీత్వం వైధవ్యంచపునఃపునః ॥

తా॥ భర్త రతికేళికిరమ్మని పిలిచినను సమ్మతించని స్త్రీ యేడు జన్మలందు స్త్రీగా జన్మించి వైధవ్యమును బొందును.

శ్లో॥ ధర్మానుకూలాయానారీ పతిభక్తిరతాప్రియా। అతిథీనాం యతీనాంచ బంధూనాంచతపస్వినాం। పూజాకర్మరతానారీ మోక్షమాప్నోతిశాశ్వతమ్ ।

తా॥ ధర్మములయందు భర్తకు అనుకూలముగానుండి పతిభక్తి గలదై అతిథులకు, సన్యాసులకు, బంధువులకు, తపోవంతులకు సేవ చేయుస్త్రీ శాశ్వతమైన మోక్షమునుజెందును.

శ్లో॥ యానారీహ్యతిథీన్నిత్యం నిత్యంకలహకారిణీ। వ్రతహీనా పతింద్వేష్టి సానారీనిరయంగతా ॥

తా॥ నిత్యము యింటికివచ్చిన అతిథులను కలహించుచు వ్రతములను వదలి భర్తతో కలహించు స్త్రీ నరకమును బొందును.

శ్లో॥ ఏవమాదీనిపాపాని బహూనివివిధానిచ। కృత్తికాదీపమాలాఖ్య

తా॥ యీ మొదలైన పాతకములు కృత్తికావ్రతము వలన నశించును.

శ్లో॥ బ్రాహ్మణానాం మునిశ్రేష్ఠ స్త్రీశూద్రాణాంతథైవచ। కార్తీక శుద్ధద్వాదశ్యాం పూర్ణిమాస్యాంతథైవచ। క్షీరాదిస్నపనంచైవ దీప మాలాం మహామునే॥

శ్లో॥ ధాత్రీఫలైర్బిల్వదళై రక్షతైస్తులసీదళైః। అగస్త్యకుసుమై శ్శంభోః పూజాకార్యమహామునే। ధాత్రీఫలంచదాతవ్యం ద్వాద శ్యాంచ మహావ్రతః। పౌర్ణిమాస్యాంమునిశ్రేష్ఠ తస్యపుణ్యఫలంశృణు॥

తా॥ బ్రాహ్మణులు స్త్రీలు శూద్రులు కార్తికశుక్ల ద్వాదశి యందును పూర్ణిమయందును శివునకు క్షీరాభిషేకమును దీపమాలా ర్పణమును ఉసిరిగఫలములతోను, అక్షతలతోను, తులసీదళముల తోను, అవిశి పువ్వులతోను, పూజచేయవలెను. ద్వాదశినాడు పూర్ణిమనాడు ఉసిరిగఫలములను దానము చేయవలెను. అట్లుగా చేయువారికి గల్గెడి ఫలమును చెప్పెదను వినుము.

శ్లో॥ మోక్షసామ్రాజ్యలక్ష్మీంచ క్షీరస్నానేన నారద। నవగ్రహాశ్చ కూష్మాండా యమదూతాస్తథైవచ। శివపూజారతందృష్ట్వా విద్ర వంతిదిశోదశ। తథైవఫలదానేన అపమృత్యుంజయత్యసౌ॥ ధాత్రీఫల ప్రదానేన అచిరాత్పుత్రమాప్నుయాత్॥

తా॥ క్షీరాభిషేకమువలన మోక్షలక్ష్మినిబొందును. శివపూజ వలన నవగ్రహములు కూష్మాండములు యమదూతలు దూరముగా దిక్కులకుపారిపోవుదురు ఫలదానమువలన అపమృత్యువు నశించును. ఉసిరిగపండు దానమువలన శీఘ్రముగా పుత్రులను బొందును.

శ్లో॥ సుందరంపురుషందృష్ట్వా స్త్రీణాంస్ఖలతివైమనః। తేనపాపేన మహతా మృతవంధ్యాప్రజాయతే॥

తా॥ స్త్రీలకు సుందరుడైన పురుషునిజూచి నంతలో మనస్సు ద్రవించును. ఆపాతకముచేత సంతానము నష్టమగుచుండును.

శ్లో॥ స్ఖలనంద్వివిధంప్రోక్తం మనసాకర్మణాతథా। ఉభయం సమ మిత్యాహు ర్జారేణతే మహామునే॥

తా॥ స్ఖలనము (సంగము) రెండువిధములు, మనస్సంగమము. క్రియాసంగమము అనఁగా జారునితో మనస్సంభోగము క్రియాసంభోగముఅను రెండువిధములు సంభోగము యీరెండును సమానదోషము లని చెప్పిరి.

శ్లో॥ మనస్సంగం క్రియాసంగం బాల్యవైధవ్యకారణం। నజాతు లోకేసర్వాసాం స్త్రీణామింద్రియనిగ్రహః। నజాతులోకేస్త్రీణాంచ కామభోగోనశామ్యతె। సువాసీనాం సర్వాసాం విధవానాం మహాముసె। కృత్తికాదీపమాలాఖ్యం పాపారణ్యదవానలమ్ ॥

తా॥ యీ మనస్సంగ క్రియాసంగములు బాల్యవైధవ్యమునకు హేతువులు. స్త్రీలకెప్పుడును యింద్రియనిగ్రహము కలుగదు. యెకప్పుడును కామభోగము శాంతించదు కాఁబట్టి పుంస్త్రీలుగాని విధవలుగాని కృత్తికాదీప మాలాల్పణ వ్రతముచేసినయెడల సమస్త పాపములు నశించును

శ్లో॥ విధవాపత్యహీనాపి నకృతంశివపూజనం।నకృతంతీర్థయాత్రంచ నకృతం దేహశోషణం। రుద్రాక్షధారణంకృత్వా నకృతంభూతిధారణం। నిరయాన్నిష్కృతిర్నాస్తి జన్మజన్మాంతరేష్వపి ॥

తా॥ పతిపుత్రులు లేనివిధవ శివపూజచేయకున్నను తీర్థయాత్ర చేయకున్నను కాయశోషణమును చేయకున్నను, రుద్రాక్షవిభూతులను ధరించకున్నను యెన్నిజన్మలకైనను నరకమునుంచి విడుదలగాదు.

శ్లో॥ విధవాపత్యహీనాపి శివపూజాకృతాయది। సతత్సమాపుత్రవతీ సాగ్నిష్టోమానయజ్ఞకృత్ ॥

తా॥ పతి పుత్రులు లేని విధవ, శివపూజచేసినయెడల పుత్రవంతురాలును యజ్ఞమును చేసినవారును దానికి సమములుగారుగదా

శ్లో॥ బహునోక్తేనకింవత్స విధవానాంతపస్వినాం। కామోపభోగ ఇచ్ఛాచ యావత్తిష్ఠతినారద। కృత్తికాదీపమాలాఖ్యం కర్తవ్యంతావదేవహి। నలిప్యతె తేనపాపైః పద్మపత్రమివాంభసా ॥

తా॥ ఓనారదా! అనేక మాటలతో యేమిపనియున్నది. విధ

మాలార్పణవ్రతమును చేయవలెను. అట్లైనయెడల తామరాకునందు జలమువలె పాపములంటవు.

శ్లో॥ స్త్రీణామపిచవంధ్యత్వ హారిణీమెవ్రకల్పితా । యానారీబాలికాః హంతి సర్వదాచవిషప్రదా । తేనపాపేనమహతా వంధ్యత్వం ప్రాప్య తేధ్రువమ్ ॥

తా॥ ఆడవారికి వంధ్యత్వపరిహారముకొఱకు కృత్తికాదీపమాలను నిర్మించితిని విషమునుపెట్టి పిల్లలను చంపెడిస్త్రీ వంధ్యయగును.

శ్లో॥ ఏవమాదీన్యసంఖ్యాని పాపానివివిధానిచ । స్త్రీణాంపదేపదే వత్స నాహంవర్ణయితుంక్షమః ॥

తా॥ ఈప్రకారముగా ఆడవారికి నిత్యము లెక్కకు మేరలేని పాతకములు సంభవించుచుండును. వాటి నన్నిటిని చెప్పుటకు నాకు తరముగాదు.

శ్లో॥ పురుషోపిచవంధ్యత్వం జారత్వేనమహామునె । బ్రాహ్మణాః వ్యథతేయస్తు యోవినిందాకరస్తథా । నిందకస్సాధువృత్తీనాం వంధ్యశ్శ్లోనసంశయః ।

తా॥ పురుషులకును జారత్వముచేతను బ్రాహ్మణబాధచేతను సాధు బ్రాహ్మణ నిందచేతను, వీర్యము వంధ్యమగును అనఁగా సంతానము కలుగదని భావము.

శ్లో॥ సర్వేషామేవపాపానా మార్తానామపినారద । కృత్తికాదీపమాలాఖ్యం పాపారణ్యదవానలమ్ ।

తా॥ సమస్తపాతకములకును ఆఁతులకును కృత్తికాదీపమాలార్పణవ్రతము చేసినచో దోషనాశకరమగును.

శ్లో॥ కార్తిక్యాంకృత్తికాయోగె ఉపక్రమ్యవ్రతంతథా । అష్టోత్తరశతంవాపి ద్విశతంత్రిశతంతువా । దీపపంక్తిరవిచ్ఛిన్నం కర్తవ్యాచ స్వశక్తితః ।

తా॥ కార్తికమాసమందు కృత్తికానక్షత్రయోగమం దారంభించి తన శక్తినిబట్టి ప్రతిరోజును నూటయెనిమిదిగాని రెండువందలుగాని మూడువందలుగాని దీపమాలికలనుఅవిచ్ఛిన్నముగానుంచవలెను

శ్లో॥ కార్తిక్యాంకృత్తికాయోగే యఃకుర్యాద్దీపమాలికాః। పాపాని విలయంయాంతి పుణ్యమాయాంతిసంపదః ॥

తా॥ కార్తికమాసమందు కృత్తికా నక్షత్రయోగమందు దీపమాలార్పణ మాచరించువానికి పాపములు నశించును. పుణ్యములు వృద్ధినొందును. సంపదలు వృద్ధినొందును.

శ్లో॥ యాఃకుర్వంతిస్త్రియోలోకే రచనాందీపమాలికాం । కార్తిక్యాం కృత్తికాయోగే ఆయుశ్శ్రీపుత్రవర్ధనం ॥

తా॥ కార్తికమాసమందు కృత్తికాయోగమందు దీపమాలారచనను చేయు స్త్రీలు ఆయువును భాగ్యమును పుత్రులనుబొందుదురు.

శ్లో॥ యథాయథాభాసయతి దీపపంక్తిరలంకృతా। తథాతథాముని శ్రేష్ఠ దహ్యంతేపాపరాశయః । నిమిషేనిమిషేతస్య పుణ్యంక్రతుశతోద్భవమ్ ॥

తా॥ కృత్తికాయోగమందు దీపమాలకెంతగా ప్రకాశించునో అంతంతగా పాపములు నశించును. ప్రతినిమిషమందు నూఱుయాగముల ఫలమును బొందును.

శ్లో॥ ఏవంవర్షత్రయంకృత్వా వ్రతంత్రైలోక్యవిశ్రుతం । ఆదౌమధ్యేతథాంత్యేచ వ్రతోద్యాపనమాచరేత్ । ఉద్యాపనావిధానేన విద్యేరాపోర్థవేధుృవం । తస్మాదుద్యాపనంకుర్యా త్పతిపుత్రాభివృద్ధయే ॥

తా॥ ఇట్లు యీవ్రతమును మూడుసంవత్సరములు చేయవలెను. ఆదియందుగాని అంతమందుగాని మధ్యనుగాని యుద్యాపనమాచరించవలెను. ఉద్యాపనము చేయనివారు పూరపందిగా జన్మింతురు. కాబట్టి ఉద్యాపనము తప్పక చేయవలెను. అట్లుగాచేసినయెడల పుత్రసంతతి గల్గును. భర్త చిరంజీవిగా నుండును.

శ్లో॥ కార్తిక్యాంమార్గశీర్షేవా మాఘేవాపిమహామునే। పంచాంగశుద్ధదివసె వ్రతోద్యాపనమాచరేత్ ॥

తా॥ కార్తిక మాసమందుగాని మార్గశీర్ష మాసమందుగాని ... ఉద్యాపనమాచరించవలయును.

శ్లో॥ మంటపంకారయేత్తత్ర కుసుమైశ్చాప్యలంకృతం । సాయంకాలే సమాహూయ బ్రాహ్మణాన్ వేదపారగాన్ । పుణ్యాహంవాచయేత్తత్ర ఆచార్యేణప్రయత్నతః ॥

తా॥ మంటపమునుకట్టించి పువ్వులతో అలంకరించి సాయంకాలమందు వేదవేత్తలయిన బ్రాహ్మణులను బిలిచి ఆచార్యుచేత పుణ్యాహవాచనమును చేయించవలయును.

శ్లో॥ పద్మానిత్రీణినిర్మాయ పంచవర్ణైస్సుశోభనైః । కలశాంస్త్రీంశ్చసంస్థాప్య వస్త్రత్రయసమన్వితాన్ । మధ్యమేకలశేశంభుం పూజయేన్నియతవ్రతః। దక్షిణేస్థాప్యతంవిష్ణు ముత్తరేషణ్ముఖంతథా। ప్రతిమాఃపూజయేత్తత్ర గాయత్రీభిఃప్రపూజయేత్ ॥

తా॥ అయిదురంగులతోను మూడుపద్మములనురచించి అందు మీద మూడు కలశములనుంచి వాటిమీద వస్త్రములను మూటిని నుంచి అందుమధ్య కలశమందు శంకరుని దక్షిణకలశమందు విష్ణువును ఉత్తర కలశమందు కుమారస్వామిని ప్రతిష్ఠించి తత్తద్గాయత్రీ మంత్రములచేత పూజించవలయును.

శ్లో॥ రాత్రౌ జాగరణంకుర్యాత్ యామేయామేచ పూజయేత్। ప్రభాతేఋత్విజైస్స్నాత్వా పునఃపూజాంసమాచరేత్ ॥

తా॥ రాత్రి జాగరణముండి ప్రతియామమునకుపూజచేసి మరునాడుదయాన తాను ఋత్విక్కులు స్నానమాచరించి పునఃపూజ చేయవలయును.

శ్లో॥ ఆచార్యాదగ్నిమాదాయ స్వగృహ్యోక్తవిధానతః। శతమష్టోత్తరంచైవ సహస్రంకారయేద్వ్రతీ । పూర్ణాహుతింతతోహుత్వా ప్రణిపత్యక్షమాపయేత్ ॥

తా॥ ఆచార్యునితో సహగూడి స్వగృహ్యోక్త విధానమ్ముగా అగ్నిప్రతిష్ఠాపనచేసి నూటయెనిమిదిమారులుగాని వేయిమారులుగాని హోమమునుచేసి పూర్ణాహుతినిచేసి నమస్కరించి ప్రార్థించవలెను.

శ్లో॥ ఆచార్యాదీన్సమభ్యర్చ్య అంగుళీయంతథైవచ । ప్రతిమాః కలశాన్వస్త్రానాచార్యేభ్యః ప్రదాపయేత్ । తతోగోదానకం చైవ

ఆచార్యాయప్రదాపయేత్ । బ్రాహ్మణాన్‌భోజయేత్తత్ర యథా విభవసారతః ॥

తా॥ ఆచార్యుఁడు మొదలగువారిని పూజించి బంగారఘంగరమును ప్రతిమలను, కలశములను, వస్త్రములను, గోవును, ఆచార్యునకిచ్చి తరువాత యథాశక్తిగా బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును.

శ్లో॥ ఏవముద్యాపనంకృత్వా ప్రతివర్షేసమాచరేత్ । స్త్రీణామేతద్వ్రతంబ్రహ్మన్ పాపారణ్యదవానలమ్ ॥

తా॥ ఇట్లు ఉద్యాపనము సేయవలెను ప్రతి సంవత్సరమందు యీ వ్రతమును చేయవలయును. ఆడువారు తప్పక యీవ్రతమును చేయవలయును. చేసినయెడల పాపములు నశించును.

శ్లో॥ యాఃకుర్వంతిస్త్రియోలోకే పతిపుత్రాన్సమాప్నుయాత్ । గోప్యమేతద్వ్రతంబ్రహ్మన్ నవాచ్యంయస్యకస్యచ । తచ్ఛ్రవణమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥

తా॥ యీ వ్రతమాచరించు స్త్రీలు భర్తలను చిరజీవులుగాచేసికొని పుత్రవంతులై భాగ్యముగలుగుదురు ఓనారదా! యీవ్రతరహస్యము యెవరికిచెప్పకుము. యీకథ విన్నమాత్రాన సమస్త పాతకములు నశించును.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణె బ్రహ్మనారద సంవాదే
కృత్తికాదీప వ్రతకల్పస్సంపూర్ణః.



# వ్రతరత్నము పూజావిధి.

ఆంధ్ర తాత్పర్యసహిత ప్రథమ ద్వితీయభాగములు.

వెల రు 2—8—0

## —◆◆ ఈ గ్రంథమందుండు వ్రతములు ◆◆—

సర్వసామాన్య పూజావిధి, కలశపూజా, పీఠపూజా, ప్రాణ ప్రతిష్ఠ, శ్రీరామ నవమీ వ్రతము, సీతారామ కళ్యాణోత్సవము, శ్రవణద్వాదశీ వ్రతము, నందికేశ్వరవ్రతము, ఏకాదశీ గురువార వ్రతము, (గరుడ) నాగపంచమీ పూజాకల్పం, షోడశగౌరీవ్రతము, స్వర్ణగౌరీవ్రతము, గజగౌరీవ్రతము, శ్రావణమంగళవార వ్రతము, దిశగౌరీ వ్రతము, అష్టమీసోమవార వ్రతము, శివవ్రతము, శని ప్రదోష వ్రతము, శివరాత్రి వ్రతము, నృసింహజయంతి వ్రతము, సావిత్రిగౌరీవ్రతము, సంకష్టగౌరీవ్రతము, కూశ్మాండదానవ్రతము, పుష్యార్క వ్రతము, సరస్వతీవ్రతము, శారదానవరాత్రికలశస్థాపనము, లక్షదవనమరువకవ్రతము, గోవ్రతము, గోమయవ్రతము, గోమూత్ర వ్రతము, వినాయకవ్రతము, సరస్వతీవ్రతము, వరలక్ష్మీవ్రతము, అనంత వ్రతము, మథనద్వాదశీ (చిలుకు) వ్రతము, కేదారేశ్వరవ్రతము, ఋషిపంచమీవ్రతము, అమాసోమవారవ్రతము, కృష్ణాష్టమీవ్రతము, గరుడపంచమీవ్రతము, శ్రీరామనవమీవ్రతము, గజగౌరీవ్రతము, షోడశస్వర్ణగౌరీపూజ, కుజగౌరీపూజ, గోపద్మవ్రతము, సంకటచతుర్థీ వ్రతము, సిరశనార్కహారవ్రతము, దానఫలవ్రతము, సూర్యచంద్రుల వ్రతము, దశఫలవ్రతము, బృహద్గౌరీవ్రతము, అముక్తాభరణసప్తమీ వ్రతము, శ్రవణద్వాదశీవ్రతము, దిశాగౌరీవ్రతము, రథసప్తమీ వ్రతము, శివముష్టికావ్రతము, సోమాష్టమీవ్రతము, గోద్వాదశీ వ్రతము, అష్టోత్తరశతదానకల్పము, సహస్రఫలదాన వ్రతకల్పము, వనభోజనవ్రతము, హనుమద్వ్రతము, బుధాష్టమీవ్రతము, షష్ఠీ పూజావ్రతము, పొంగలివ్రతము, సింధూస్నాన వ్రతము, లక్షవత్తి పూజాకల్పము, మహాలింగార్చనము, సత్యనారాయణవ్రతము ఈగ్రంథ